


ప్యారీస్ లాక్టోకింగ్ దారిలో వెళ్లండి

భలే రుచి, మీరు తింటూనే వుంటారు!




8253

ఆడుతూ పాడుతూ నవ్విస్తూ కవ్విస్తూ హాయిగా సాగే సర్వజన రంజనం



చందమామ విజయా
కంబైన్స్ వారి



నాగిరెడ్డి - చక్రపాణి
ఆశీస్సులతో

# బృందావనం

సింగీతం శ్రీనివాసరావు




'మేగీ జిగ్సా పజిల్'లో
మేగీ సాహసమయ ప్రపంచం
సమకూర్చుకోండి.



మేఘాలలో తేలిపొండి! 'మేగీ స్కై ఫ్లైజర్'లో





మేగీ 'ఏస్ ఎడ్వెంచరర్స్ గేమ్'లో
సముద్రం నుండి ఆకాశం వరకూ
యాత్రను పూర్తి చేయండి.

మేగీ 'హూ-డున్-ఇట్ మిస్టరీ'
గేమ్‌లో దొంగను పట్టుకోండి.

# సరదా ప్రియులకు అద్భుత సాహస యాత్రలు!

## మేగీ క్లబ్ సదస్యులకు ఉచిత బహుమతులు!

ఇతర గ్రహవాసుల చతురతతో
తలపడండి-మీ తెలివితేటలతో 'మేగీ
రెయిడర్స్ ఆఫ్ ది రెడ్ స్టార్' గేమ్‌లో



ఏయ్! పిల్లలూ! మేగీక్లబ్‌లో చేరి మేగీ సాహస
ప్రపంచంలో ప్రవేశించండి!

మీరు మేగీ నూడుల్స్ యొక్క ఐదు ఖాళీ సంచులకు
ముందు వైపున ఉండే ఈ [MAGGI] ను కత్తిరించి మీరు
ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం మాకు పంపించండి.
అంతే! మీకు 6 నుండి 8 వారాలలో మేగీ క్లబ్ నుండి ఎంతో
వినోదాన్నీ ఉత్సాహాన్నీ కలిగించే బహుమతి అందుతుంది.

గుర్తుంచుకోండి! మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు
కావలసిన బహుమతితోబాటు మీ పేరు, చిరునామా,
మీరు పుట్టిన తేదీని పంపండి. ఈసరికే మీరు మేగీ క్లబ్
సభ్యులైతే మీ సభ్యత్వపు నంబరు పంపండి. ఒకవేళ మీరు
మేగీ క్లబ్బర్ కాని పక్షంలో మేగీ క్లబ్ సభ్యత్వం పొందటానికిదే
సదవకాశం. పై వివరాలు పంపేటప్పుడు సభ్యత్వం కూడా
కావాలని వ్రాయండి. మేము మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డును
మీ బహుమతితో బాటు ఉచితంగా పంపుతాము.



ఉచిత మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్వైజర్.
మీరు పొందే ప్రతి 2 బహుమతులతో ఒక మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్వైజర్ ఉచితం.

మా చిరునామా:

**MAGGI CLUB**
P.O. Box 5788 New Delhi-110 055




మరొక సదుపాయం కూడా! ఈ సరికి మీరు మీ మేగీ బర్డ్ హౌస్‌ను సేకరించనట్లయితే ఇపుడే సేకరించండి!




# చందమామ

నంస్థాపకుడు: 'చక్రపాణి' సంచాలకుడు: నాగిరెడ్డి

## యుద్ధాలు ఎందుకు వస్తున్నాయి?

"ప్రేమకు హింస వ్యతిరేకమైనది. ప్రేమగల మనిషి మరొకరిని చంపడం అసాధ్యం. ఆ అవసరం కూడా ఉండదు."

డెబ్భై అయిదేళ్ళ క్రితం, భారతీయుణ్ణి వివాహమాడిన ఆంగ్ల వనిత ఈస్తర్ మేనన్‌కు రాసిన ఉత్తరంలో మహాత్మాగాంధీ ఇలా అన్నారు. మొదటి ప్రపంచయుద్ధం జరుతూన్న రోజులలో గాంధీజీ— దక్షిణాఫ్రికాలో తెల్లవాళ్ళ జాత్యహంకారానికి వ్యతిరేకంగా, అక్కడికి వలస వెళ్ళిన భారతీయుల పక్షంలో నిలబడి పోరాటం జరిపి, స్వదేశానికి తిరిగి వచ్చారు. విదేశపాలన నుంచి మనదేశానికి విముక్తి కలిగించడం ఎలాగా అని ఆలోచిస్తూన్న కాలఘట్టంలోనే గాంధీజీ ఆ ఉత్తరం రాశారు. ఆ ఉత్తరంలో ఆయన ఇంకా ఇలా వివరించారు: ఒక పాముమీద దయగల వాళ్ళెవరూ దానిని చంపరు. అదే విధంగా ఆ పాముకూడా అలాంటివాళ్ళ జోలికి రాదు. ఇటువంటి మానసిక పరిపక్వతనే మనమందరం సాధించాలి. అయితే, దీనిని వ్యక్తులు సాధించవచ్చు కాని, దేశాలకు మాత్రం సాధ్యంకాదు. ఎందుకంటే, అన్ని దేశాలూ, అన్ని రంగాలలోనూ సమానమైన అభివృద్ధి సాధించడం అన్నది అసాధ్యమైన విషయం. కాబట్టి, దేశాల మధ్య స్పర్థలు, యుద్ధాలు అనివార్యమవుతాయి. అయితే, మంచి కోసం పోరాడే ఏ దేశమైనా సరే 'ఆత్మశక్తి'తో పోరాడాలి.

బాపూజీ మాటలు అక్షరాలా నిజమయ్యాయి. పేద-ధనిక దేశాలమధ్య, ప్రజలమధ్య తేడాలు ఎక్కువయ్యాయి. ఆ కారణంగానే రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. ఆ తరవాత కూడా అక్కడక్కడ, అప్పుడప్పుడు చిన్నచిన్న యుద్ధాలు జరుగుతూ ఉన్నాయి.

గాంధీజీ జన్మదిన (అక్టోబర్ 2) సందర్భంగా ఆయన మాటలను స్మరించుకుని, మంచికోసం పోరాడే దేశాలన్నీ ఆయన చెప్పినట్టు 'ఆత్మశక్తి'తో పోరాడాలని ఆశిస్తున్నాము.

సంపుటి 90 అక్టోబర్ '92 సంచిక 4

విడి ప్రతి: 4-00 :: సంవత్సర చందా: 48-00

వార్తలు-విశేషాలు:

# పశ్చిమ ఆసియాలో నూతన శాంతి ప్రయత్నాలు



ఇజ్రాయెల్ లో పదిహేను సంవత్సరాలు సాగిన 'లీకుడ్‌పార్టీ' పాలన అనంతరం ప్రస్తుతం మళ్ళీ లేబర్‌పార్టీ అధికారంలోకి వచ్చింది. ఇంతకాలంగా కొనసాగుతూ వస్తున్న పశ్చిమ అసియా సమస్య పరిష్కారమయ్యే సూచనలు కనిపిస్తున్నాయి.

120 స్థానాలుగల ఇజ్రాయెల్ పార్లమెంటుకు గత జూన్ నెలలో జరిగిన ఎన్నికలలో లేబర్‌పార్టీ 47 స్థానాలు గెలుచుకున్నది. పాలకపక్షమైన లీకుడ్‌పార్టీకి 33 స్థానాలు లభించాయి. 12 స్థానాలు గెలుచుకున్న మెరెట్జ్ పార్టీ, లేబర్‌పార్టీతో సహకరించడంతో లేబర్ పార్టీకి అధికారం చేపట్టడానికి కావలసిన మెజారిటీ లభించింది. 5 స్థానాలు గెలుచుకున్న రెండు అరబ్ పార్టీలు కూడా లేబర్‌పార్టీకి తమ మద్దతును తెలియజేశాయి.

ఆ విధంగా లేబర్‌పార్టీ నాయకుడు ఐట్జక్ రాబిన్ నూతన ప్రధాని అయ్యారు. పాలస్తీనా ప్రజలను 15 సం॥లు ముప్పుతిప్పలు పెట్టిన లీకుడ్ నాయకుడు ఐట్జక్ షమీర్ పరిపాలన అంతమయింది. ఇది ఇజ్రాయెల్ - పాలస్తీనా ప్రజలమధ్య శాంతి ఏర్పడడానికి దోహదం చేస్తుందని పరిశీలకులు భావిస్తున్నారు.

ఐట్జక్ రాబిన్ డెభ్భై ఏళ్ళ క్రితం జెరూసలెంలో జన్మించారు. ఆయన తల్లిదండ్రులు తూర్పు ఐరోపా నుంచి వలస వచ్చి పాలస్తీనాలో స్థిరపడినవారు. ఆ విధంగా ఆయనను ఇజ్రాయెల్‌లో జన్మించిన (సాబ్రా) మొట్టమొదటి ప్రధానమంత్రి అని చెప్పవచ్చు. వ్యవసాయ విద్యలో శిక్షణ పొందాక ఆయన 'పాల్ మాక్' అనే రహస్య పోరాట బృందంలో చేరారు. ఇజ్రాయెల్ స్వతంత్రం పొందినతరవాత, ఆయన 'ఇజ్రాయెల్ రక్షణదళం'లో చేరారు. కొంతకాలానికి ప్రధాన అధికారి అయ్యారు. 1968వ సం॥లో అమెరికాకు ఇజ్రాయెల్ రాయబారిగా వెళ్ళారు.

ఐదేళ్ళయ్యాక స్వదేశానికి తిరిగి వచ్చి, 1974 నుంచి 1977 వరకు లేబర్‌పార్టీ నాయకత్వంలో ఇజ్రాయెల్ ప్రధాన మంత్రి పదవిని నిర్వహించారు.

ఆ తరవాత లీకుడ్—లేబర్ పార్టీలు సంయుక్తంగా ఏర్పాటు చేసుకున్న సంకీర్ణ ప్రభుత్వంలో 1984 వ సం॥ నుంచి అది 1990 లో పతనమయ్యేంత వరకు రక్షణ మంత్రిగా పదవీ బాధ్యతలు నిర్వహించారు.

ప్రస్తుతం కొత్తగా ఏర్పడిన ప్రభుత్వం ద్వారా, చాలా కాలంగా అపరిష్కృతంగా ఉంటూన్న పాలస్తీనా సమస్యకు పరిష్కారం లభించగలదని భావిస్తున్నారు. రాబిన్ తన టీవీ—రేడియో ప్రసంగాలలో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, ప్రస్తుత సామాజిక అవసరాలకు అనుగుణంగా జాతీయ విధానాలలో మార్పులు ప్రవేశపెట్టగలనని ప్రజలకు హామీ ఇచ్చారు.

అదేవిధంగా ఆయన అరబ్ నాయకులయిన జోర్డాన్ రాజునూ, లెబనాన్, సిరియా అధ్యక్షులనూ జెరూసలెంలో చర్చలు జరపటానికి ఆహ్వానించారు. ఇజ్రాయెల్ ఆక్రమిత ప్రాంతాలలో భవన నిర్మాణ కార్యకలాపాలను ఆపుచేశారు. ఆ తరవాత ఈజిప్టు అధ్యక్షుడు హొజ్నీ ముబారక్‌ను కలుసుకోవడానికి స్వయంగా కైరోకు వెళ్ళి, ఆయనతో చర్చలు జరిపారు. పశ్చిమ ఆసియాలో శాంతి స్థాపనకు ఇది సరయిన సమయమని ఉభయులూ అంగీకరించారు.

ఈ సమయంలోనే పాలస్తీనా విమోచన సంస్థ(పి. ఎల్. ఓ.)—యాభైఏళ్ళ క్రితం పాలస్తీనా ప్రజలను మాతృభూమి నుంచి తరుమగొట్టి, ఆక్రమించిన పశ్చిమ తీరాన్నుంచీ, 'గాజా ప్రాంతం' నుంచీ ఇజ్రాయెల్ వెంటనే వైదొలగాలని కోరింది.

పి. ఎల్. ఓ. నాయకుడు యాజర్ అరాఫత్ ప్రధాని రాబిన్‌ను కలుసుకోవాలన్న కోరికను వ్యక్తంచేశారు.




పశ్చిమ ఆసియాలో సుస్థిరమైన శాంతిని నెలకొల్పడానికి వాషింగ్టన్‌లో చర్చలు జరుగుతున్నాయి. ఈ చర్చలలో ఇజ్రాయెల్ ప్రధాని ఇట్జక్ రాబిన్ చేయనున్న నూతనసూచనలను, ఇతర దేశాలు ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నాయి.



# దయ్యంపోరు

రంగాపురం అనే చిన్న పట్టణంలోని, ప్రభుత్వ కచ్చేరీలో పనిచేసే కైలాసం అనే యువకుడికి, పల్లె గ్రామంలోని కాత్యాయని అనే అమ్మాయితో కొత్తగా పెళ్ళయింది. అయితే, రెండు మూడు నెలల ప్రయత్నం తర్వాతనే, అతడికి పట్టణానికి కాస్త పెడగా తక్కువ అద్దెలో ఒక పాతకాలపు ఇల్లు దొరికింది.

ఇల్లు దొరకగానే కైలాసం, భార్యను పట్టణానికి తీసుకు వచ్చాడు. అతడు అద్దెకు తీసుకున్నది మూడు గదుల ఇల్లు. భార్య పుట్టింటి నుంచి సారెగా చాలా సామాను తెచ్చింది. కైలాసం ఆమెతో ఇల్లు సర్దుకోమనీ, రాత్రి భోజనానికి ఒక స్నేహితుడింటికి వెళదామనీ చెప్పి, కచ్చేరీకి వెళ్ళిపోయాడు.

భర్త అటు వెళ్ళగానే కాత్యాయని ముందు గదిలో కుర్చీలు వేసి, కిటికీలకు తెరలు కట్టింది. రెండో గదిలో పందిరి మంచం, బట్టల బీరువా, గోడకు నిలువుటద్దం అమర్చింది. మూడో గదిలో కుంపటీ, వంట పాత్రలూ సర్దింది.

ఈ పనులన్నీ పూర్తయేసరికి సాయంకాలమయింది. ఆ తరవాత కాత్యాయని శుభ్రంగా స్నానంచేసి, ముందు గదిలో వున్న కుర్చీలో కూర్చుని నింపాదిగా జాజి మొగ్గల మాల కడుతూండగా, కోతి ఒకటి కిచకిచ మంటూ కిటికీలోంచి లోపలికి దూకింది.

కోతిని చూసి భయపడి కాత్యాయని కుర్చీలోంచి లేవబోయేంతలో, కోతి ఒక ఆడదయ్యంగా మారి, "ఏదో రాక్షసిని చూసినట్టుగా, ఎందుకా భయం?" అంటూ కసిరి, "పాతికేళ్ళ క్రితం నా బంగారం అమ్మి ఈ ఇల్లు కొన్నాను. మా ఆయన తాగుళ్ళకూ, జూదాలకూ ఈ ఇల్లు

మాచిరాజు కామేశ్వరరావు



అమ్మేయాల్సి వచ్చిందనుకో! అయినా, ఈ ఇంటి పనులన్నీ నా ఇష్టప్రకారమే జరగాలి," అని గెంతి కుర్చీలో కూర్చున్నది.

కాత్యాయని భయంతో కంపించిపోతూ, దయ్యం కేసి చూస్తూ అలాగే నిలబడిపోయింది.

దయ్యం విసుగ్గా, "బెల్లం కొట్టిన రాయిలా అలా నిలబడిపోయావేం? వచ్చిన వాళ్ళకు ఫలహారం అదీ ఇచ్చి సత్కరించాలనే ఇంగితజ్ఞానం లేదా?" అన్నది.

కాత్యాయని అలా వణుకుతూనే వంట గదిలోకి వెళ్ళి, పుట్టింటి నుంచి తనతో పాటు తెచ్చుకున్న సున్నివుండలు, అరిసెలు ఒక పళ్ళెంలో పెట్టి తెచ్చి, దయ్యాని కిచ్చింది.

దయ్యం లొట్టలు వేస్తూ వాటిని తిని, ఇల్లంతా ఒకసారి కలయచూసి, "హవ్వ, ఇది ఇల్లా, వల్లకాడా? ఇదేం సామాను సర్దుకోవడం, నా మొహం! నేను చెప్పినట్టు సర్దావంటే, నీ మొగుడు నిన్ను తెగ మెచ్చేస్తాడు," అంటూ ముందుగదిలో వంట పాత్రలు, కుంపటి, రెండో గదిలో కుర్చీలు, వెనక మూడో గదిలో పందిరి మంచం సర్దమన్నది.

అలా సర్దితే బాగుండదని కాత్యాయని నచ్చజెప్పబోతే, దయ్యం కస్సుమని, "నే చెప్పినట్టు సర్దు. పైకి కనపడుతున్నంత మంచిదాన్ని కాను. నేను జాగ్రత్త." అన్నది.

హడలిపోయిన కాత్యాయని, దయ్యం చెప్పినట్టుగా ఇల్లు మళ్ళీ సర్దింది. అంతలో వీధిలో కైలాసం వస్తున్నఅలికిడి విని, "నాసంగతి నీ మొగుడి దగ్గిర నోరు జారకు. తెలుసుగా—నేను అట్టే మంచిదాన్ని కాను," అంటూ మళ్ళీ కోతిగా మారి కిటికీలోంచి బైటికి దూకింది దయ్యం.

కైలాసం ఇంట్లోకి వస్తూనే, కాత్యాయని ఇల్లు సర్దిన తీరు చూసి నిర్ఘాంతపోయి,

''నీకేమన్నా మతి పోయిందా? ఎవరైనా ఇల్లు ఇలా సర్దుతారా!'' అంటూ కాత్యాయనిని గట్టిగా కోప్పడి, తానే సామానును సర్దవలసినచోట జాగ్రత్తగా సర్దిపెట్టడం ప్రారంభించి ముగించేసరికి బాగా పొద్దు పోయింది. అంత రాత్రివేళ మిత్రుడి ఇంటికి భోజనానికి వెళ్ళడం మర్యాద కాదని, కైలాసం ఇంత మజ్జిగ తాగి పడుకున్నాడు.

కాత్యాయని అతడికి దయ్యం గురించి చెప్పబోయి, దాని హెచ్చరిక గుర్తుకువచ్చి మెదలకుండా ఊరుకున్నది.

ఆరోజు పొద్దుపోయి లేచిన కైలాసం స్నానం చేసి, కచ్చేరీకి బయలుదేరుతూ, ''మధ్యాహ్నం భోజనానికి వస్తాను. వంట త్వరగా ముగించు,'' అని కాత్యాయనికి చెప్పి వెళ్ళిపోయాడు.

కాత్యాయని వంట ఆరంభించిందే ఆలస్యం. దయ్యం కిటికీలోంచి కోతిలాగా దూకి దయ్యంగా మారి, కాత్యాయని పక్కనే పీట వేసుకుని దర్జాగా కూర్చుని, కాత్యాయనిచేత బలవంతంగా పప్పులో చక్కెర, పులుసులో దోసెడు కారం, గుప్పెడు ఉప్పు వేయించింది. వంకాయ కూర ముక్కలు వేపకుండానే, ఇంత కారం కలిపించి మూత పెట్టించింది. తను మాత్రం కాత్యాయని చేత కమ్మని వంట వండించుకు తిని, మళ్ళీ కోతిలాగా మారి ఒక్క గెంతున కిటికీలోంచి బయటకు దూకింది.





మధ్యాన్నం మంచి ఆకలిమీద వచ్చిన కైలాసం, కాత్యాయని వడ్డించిన కూరలు నోట పెడుతూనే మండిపడి, "ఇది వంట కాదు ఎండుచెత్త! నా కర్మకొద్దీ నిన్ను కట్టుకున్నాను," అంటూ అరిచి, పళ్ళాన్ని విసిరికొట్టి వెళ్ళిపోయాడు.

కాత్యాయని గుడ్ల నీరు కుక్కుకుని, వంట గది శుభ్రం చేసుకుంది. ఇలా రెండు వారాలపాటు ఆడదయ్యం ఆమెను ఏడిపించుకు తిన్నది. అది ఆమెచేత పిచ్చి పనులు చేయించి, భర్త చీవాట్లు పెట్టేలా చేసి ఆనందపడేది.

ఆడదయ్యం పోరు పడలేక, విసిగిపోయిన కాత్యాయని ఒకరోజు రాత్రి, కైలాసంతో, "నాలుగు రోజుల పాటు పుట్టింట వుండి వస్తాను," అన్నది.

"మహరాజుగా వెళ్ళు! నాకూ కాస్త మనశ్శాంతిగా వుంటుంది," అన్నాడు కైలాసం.

చిక్కిపోయి తిరిగి వచ్చిన కూతుర్ని చూసి, కాత్యాయని తల్లి, "ఇలా అయిపోయావేం, తల్లీ!" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

దయ్యం విషయం తల్లిదండ్రులకు చెబితే, వాళ్ళు హడలిపోయి బెంగపడతారని, ఆమె ఆ విషయం వాళ్ళకు చెప్పదలచలేదు. అయితే, ఆ సాయంత్రం పొలంనుంచి వచ్చిన అన్న అంజనేయులు గుచ్చి గుచ్చి అడగ్గా జరిగిందేమిటో అతడికి చెప్పేసింది.

అంతా విన్న ఆంజనేయులు తల పంకించి, "చెల్లీ, నువ్వేమీ దిగులుపడకు. ఒకేఒక్క వారం రోజుల్లో ఆ ఆడదయ్యం పీడ విరగడ చేస్తాను!" అన్నాడు.

మర్నాటి సాయంత్రం అంజనేయులు పట్నం వెళ్ళి, కచ్చేరీలో కైలాసాన్ని కలుసుకున్నాడు. కైలాసం బావమరిదిని చూస్తూనే కోపంగా, "ఏం బావా ఇలా వచ్చావు? నీ మతిలేని చెల్లెలు ఇల్లు వదిలాక, నేనెలా వున్నానో చూసి నవ్వి పోదామనుకున్నావా?" అని అడిగాడు.

ఆంజనేయులు శాంతపడమన్నట్టు కైలాసం వీపుతట్టి, బయటకు తీసుకుపోయి, దయ్యం గురించి వివరంగా చెప్పి, "ఆ దయ్యాన్ని ఏడేడు పధ్నాలుగు ఊళ్ళు దాటి పారిపోయేలా చేస్తాను. నువ్వు మాత్రం నే చెప్పినట్టు చెయ్యి!" అని బావమరిదికి చేయవలసిందేమిటో వివరించాడు.

తర్వాత అతను ఇంటికి పోయి, మర్నాడు సూర్యోదయంతోనే కాత్యాయన్ని అత్తవారింటికి ప్రయాణం కట్టించి, తను చేయవలసిందేమిటో ఆమెకు వివరంగా చెప్పాడు.



కాత్యాయని తిరిగి ఇంటికి రాగానే, దయ్యం కోతిరూపంలో కిచకిచా, కిచకిచా అంటూ అట్టహాసంగా కిటికీలోంచి ఇంట్లోకి దూకి, వెంటనే దయ్యంగా మారి, "నువ్వు పుట్టింటనే వుండిపోతావేమో అని దిగులు పడ్డాను. సరే, మీ ఆయన మధ్యాహ్నం భోజనానికి వస్తాడు గదా! నన్ను ఆకలి కాల్చేస్తున్నది. వేగిరం మీఆయన వంటా, నా వంటా ముగించు," అంటూ తొందర పెట్టింది.

మధ్యాహ్నం భోజనానికి వచ్చిన కైలాసం, పళ్ళెం ముందు కూర్చుని, "ఆహా, అద్భుతమైన వంట, అమోఘమైన రుచి!" అంటూ వచ్చే వాంతిని కష్టపడి ఆపుకుని, కాత్యాయని వండిన కూరలు తిన్నాడు.

రాత్రికి దయ్యం చెప్పినట్లుగా కాత్యాయని స్నానానికి చన్నీళ్ళు తోడినప్పుడు, "ఆహా, చన్నీళ్ళస్నానం సర్వరోగహరం, శరీరానికి చలవ, అని వైద్యుడు దానయ్య ఉట్టినే చెప్పాడా! ఎంత హాయి, ఎంత హాయి!" అంటూ స్నానం ముగించాడు.

ఆ రాత్రి మంచం మీద దుప్పటికి బదులు కాత్యాయని గొంగళి పరిస్తే, "మంచిపని చేశావు. ఈ మండు వేసవిలో గొంగళినిద్ర చాలాసుఖంగా ఉంటుంది." అంటూ కైలాసం భార్యను మెచ్చుకున్నాడు.

ఇదంతా చూసి మండిపోయిన దయ్యం, మర్నాడు కాత్యాయనితో, "నీ మొగుడు అడంగిరేకులవాడిలా మారిపోయాడేం? పెళ్ళాం ఏం చేసినా గంగిరెద్దులా తల ఊపేయడమే, ఛీ!" అంటూ మెటికలు విరిచింది.

ముందే అనుకున్న విధంగా ఆంజనేయులు ఉదయం వేళ కాత్యాయని వాళ్ళ ఇంటికి వచ్చాడు.

అతణ్ణి చూస్తూనే కైలాసం, వంటగదిలో ఉన్న కాత్యాయనికి వినపడేలాగా, "ఇదిగో! మీ అన్నయ్య ఆంజనేయులు వచ్చాడు," అంటూ కేక పెట్టాడు.

ఆ రోజు చీకటితోనే కాకి రూపంలో ఇంటి అటక మీద ఎక్కి కూర్చున్న దయ్యం, ఇదంతా గమనిస్తూనే వున్నది.

భర్త కేకవిన్న కాత్యాయని, "ఇక్కడ పనిలో ఉన్నాను. ఆంజనేయులు అన్నయ్య ముందు చెప్పాపెట్టకుండా, ఇంత హఠాత్తుగా వచ్చాడేం!" అన్నది గట్టిగా.

దానికి ఆంజనేయులు పెద్దగా, "మరేం లేదు, చెల్లీ! ఆమధ్య కరణంగారి చిన్నకోడల్ని, దయ్యం ఒకటి పీడించసాగింది. దాన్ని నిన్న సాయంత్రం పట్టి, భూస్థాపితం చేసేందుకు సీసాలోకి నెట్టి బిరడా బిగించబోతూంటే—బాబోయ్, నాకు తోడుగా మరొక ఆడదయ్యం కావాలంటూ, కళ్ళు నీళ్ళు పెట్టుకున్నది. దానిమీద జాలి కలిగి, మరొక ఆడదయ్యం కోసం వెతుకుతూ, ఇటొచ్చాను," అన్నాడు.

ఆంజనేయులు, పట్టిన భూతాన్ని భూస్థాపితం, అన్న మాటలు వింటూనే అటకమీద కాకి రూపంలో వున్న దయ్యం కావ్, కావ్ అంటూ ఎగిరి, కిటికీలోంచి బయటికి దూకి, అక్కడికి ఏడామడల దూరంలో ఉన్న అడవికేసి పారిపోయింది.

ఇది చూసి కైలాసం పరమానందం చెంది, ఆంజనేయులి చేతులు పట్టుకుని, "క్షమించు, బావా! అసలు సంగతి తెలియక, నీ చెల్లెలికి మనస్తాపం కలిగించాను," అన్నాడు.






# మాయా భవనం

## 7

[మహేంద్రనాథుడనే యువకుడు వీరసేనమహారాజు అనుమతి పొంది, విడిదిభవనం నుంచి కనిపించకుండా పోయిన యువరాణి విద్యావతిని వెతకటానికి బయలుదేరాడు. అతడు మొదట సారససరోవర విడిదిభవనం పరిసరాలను పరీక్షించి చూడటానికి అక్కడికి వెళ్ళి, పడవవాళ్ణి పలకరించి, అక్కడినుంచి అడవి కేసి బయలుదేరాడు. —తరవాత]

మహేంద్రనాథుడు, సారససరోవర తీరాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ, అరణ్యం కేసి నడక సాగించాడు. సరోవరం చుట్టూ సరైన మార్గం లేదు. ఏవేవో తీగలూ, ముళ్ళ పొదలూ అడ్డదిడ్డంగా అల్లుకుని ఉన్నాయి. జాగ్రత్తగా వాటిని తొలగించుకుంటూ, అక్కడక్కడా ఆగి, విడిదిభవనాన్ని పరీక్షించి చూస్తూ, అరణ్యంలోకి మార్గమేదైనా కనిపిస్తుందేమోనని వెతుకుతూ ముందుకు పోసాగాడు. ఆరోజు సూర్యాస్తమయం అయ్యేవరకూ ఎంత ప్రయత్నించినా, అతడికి అరణ్యంలోకి మార్గం కనిపించలేదు. ఆ రాత్రంతా ఒక చెట్టుకింద బండమీద గడిపాడు. తెల్లవారగానే లేచి చుట్టుపక్కల కలయచూశాడు. తను రాత్రి కూర్చున్న బండకు కొంత దూరంలో, సరోవరజలం నుంచి చిన్న మెట్లు కనిపించాయి. మహేంద్రనాథుడు



ఆ మెట్లను సమీపించాడు. మెట్లు సరిగ్గా కనిపించకుండా వాటిమీద చెట్లకొమ్మలు అడ్డదిడ్డంగా వేయబడి ఉన్నాయి. అతడు వాటిని తొలగించాడు. అడవిలోకి సన్నటి మార్గం కనిపించింది. ఒత్తుగా పచ్చటి ఆకులు పరచిన ఆ మార్గం, కొత్తగా ఏర్పరచిందని అతడు గ్రహించాడు. క్రూరమృగాలు తన మీదికి రాకుండా తగిన జాగ్రత్తతో మహేంద్రనాధుడు ముందుకు నడిచాడు.

దారికి ఇరువైపులా ఎత్తయిన చెట్లు ఉండడంవల్ల, సూర్యోదయం అయినప్పటికీ, మార్గం మసకచీకటిగానే ఉన్నది. అలా ఎంతోసేపు నడిచి, మహేంద్రనాధుడు సూర్యాస్తమయ వేళకు, ఒక సమతలప్రదేశాన్ని చేరాడు. మార్గానికి ఒకవైపున చిన్న కుటీరం కనిపించింది. అరణ్యమధ్యంలో ఈ కుటీరం ఎలా వచ్చిందా అని అనుకుంటూ మహేంద్రనాధుడు దానిని సమీపించాడు.

"ఎవరికోసం చూస్తున్నావు, నాయనా?" అన్న కంఠస్వరం వినిపించింది.

మహేంద్రనాధుడు, కంఠస్వరం వినిపించిన దిక్కుకేసి తిరిగి చూశాడు.

పెద్దపొదకు అవతలవైపున ఒక సన్యాసి, మొక్కలకు నీళ్ళు పోస్తూ కనిపించాడు. మహేంద్రనాధుడు, చేతులెత్తి ఆయనకు నమస్కరించి, "నేనొక ముఖ్యమైన కార్యం మీద బయలుదేరాను. అనుకోకుండా తమ దర్శనభాగ్యం కలిగింది," అన్నాడు.

ఆజానుబాహువయిన ఆ సన్యాసి ప్రశాంతవదనం చూసి మహేంద్రనాధుడు ఒక్కక్షణం ఆశ్చర్యం చెందాడు. కరుణతో నిండిన చూపులతో, ఆయన మందహాసం చేస్తూ, "ఇప్పటికే సూర్యుడు అస్తమించాడు. నీ గమ్యం ఏదైనప్పటికీ, ఈ రాత్రి ఇక్కడే గడిపి, తెల్లవారాక బయలుదేరు, నాయనా!" అని మహేంద్రనాధుడి భుజాన్ని ఆప్యాయంగా తాకి, కుటీరంకేసి నడిచాడు.

మహేంద్రనాధుడు ఆయనను అనుసరించాడు. ఇరువురూ కుటీరంలోకి ప్రవేశించాక, సన్యాసి ఒక చాపమీద కూర్చున్నాడు. మహేంద్రనాధుడు ఆయన పాదాలవద్ద కూర్చున్నాడు.

"నేను అనేక సంవత్సరాలు మనశ్శాంతికోసం దేశాలెన్నో తిరిగాను. ఆఖరికి ఇక్కడికి చేరాను. ఈ ప్రాంతానికి వచ్చిన తరవాత, మరెక్కడికీ వెళ్ళాలనిపించలేదు. నేనిక్కడికి వచ్చాక నన్ను చూసిన మొట్టమొదటి వాడివి నువ్వే." అన్నాడు సన్యాసి.

మహేంద్రనాధుడు మౌనంగా సన్యాసి పాదాలు ఒత్తసాగాడు.

"నాయనా, నువ్వెవరో, ఏ కార్యంమీద ఇటు వచ్చావో చెప్పనే లేదు!" అని అడిగాడు సన్యాసి.

"మహాత్మా! నా పేరు మహేంద్రనాధుడు. వీరగిరి రాజ్యానికి చెందినవాణ్ణి. చిన్నప్పుడే నా తండ్రి మరణించాడు. అప్పటినుంచి మా తల్లీకొడుకుల క్షేమాన్ని మా పినతండ్రీ, పినతల్లీ చూడసాగారు. కాని దురదృష్టవశాత్తు మాపినతల్లి కానుపు సమయంలో మరణించడంవల్ల, మా పినతండ్రి జీవితం మీద విరక్తితో, మమ్మల్ని వదలి ఎటో వెళ్ళిపోయాడు. అప్పటి నుంచి నేనూ, మా తల్లి మాత్రం



ఉంటున్నాము. మా తల్లి దేవీఆలయానికి పూలమాలలు కట్టిఇస్తూ, దానిద్వారావచ్చే ఆదాయంతో బతుకుతున్నాము," అన్నాడు మహేంద్రనాధుడు.

ఆ మాటలు వినగానే, సన్యాసి చటుక్కున తన కాళ్ళు వెనక్కు లాక్కున్నాడు. దయనీయమైన తన వృత్తాంతాన్ని వినడంతో సన్యాసి హృదయం చలించిందని భావించిన మహేంద్రనాధుడు మళ్ళీ, "ఒక వారం క్రితం, వీరగిరి యువరాణి విద్యావతిని ఎవరో అపహరించారు. రాజభటులు ఆమెకోసం నలుదిశలా వెతికారు. కాని ఆమెజాడ తెలియలేదు. కాబట్టి, ఆమెను



వెతకటానికి నేను బయలుదేరాను. అందుకు రాజుగారి అనుమతి కూడా పొందాను. సరోవరాన్ని అనుకుని వున్న అరణ్యంలో ప్రవేశించి, ఇటుగా వచ్చి మిమ్మల్ని దర్శించాను,'' అన్నాడు.

''అలాగా! ఈ పరిసరాలలో మానవులెవరూ లేరు. ఒకవైపున ధవళగిరి పర్వతాలున్నాయి. వాటిలోకి మానవమాత్రులెవరూ ప్రవేశించలేరు. పర్వతానికి అవతల హిమగిరి రాజ్యం ఉన్నది. ఇక్కడి నుంచి ఆ రాజ్యం చేరడంకూడా దుర్లభమే నాయనా!'' అన్నాడు సన్యాసి.

''పడమటిదిక్కు నుంచి వెతికితే మంచి ఫలితం వుంటుందని జ్యోతిషాచార్యులు సెలవిచ్చారు, మహాత్మా! నేను యువకుణ్ణి; ఎంతటి కష్టాన్నయినా ఎదుర్కోగలను. ధర్మప్రభువయిన మా రాజు విచారాన్ని పోగొట్టడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. నా కర్తవ్యనిర్వహణలో నా ప్రాణాలను కూడా ఒడ్డడానికి సిద్ధంగా ఉన్నాను!'' అన్నాడు మహేంద్రనాధుడు.

''ఆదర్శపారుడుగా నీ కర్తవ్యాన్ని నిర్వర్తించడానికి నువ్వు తీసుకున్న నిర్ణయం మెచ్చుకోదగినది. సరే, నిద్రపో. ఉదయమే బయలుదేరవచ్చు,'' అని సన్యాసికూడా నిద్రకు ఉపక్రమించాడు.

మహేంద్రనాధుడు ఉదయం నిద్రలేచేసరికి సన్యాసి ధ్యానంలో ఉన్నాడు. సన్యాసి కళ్ళు తెరవగానే, మహేంద్రనాధుడు ఆయనకు సాష్టాంగ నమస్కారం చేశాడు. సన్యాసి అతన్ని ఆశీర్వదించి, ''అపూర్వమైన నీ ధైర్యసాహసాలే నీకు విజయం సమకూరుస్తాయి. ఇదిగో, ఈ ఉంగరాన్ని ధరించు. దీనిని నీకోసమే దివ్యశక్తులు కలదిగా అభిమంత్రించాను. ఈ ఉంగరంలోని రాయికి ప్రత్యేకమైన శక్తులున్నాయి. అవి ఏవో మునుముందు నీకే తెలుస్తాయి. అయితే, ఈ విషయం నువ్వు మరెవరికీ చెప్పకూడదు. చెప్పావో, ఆ క్షణమే శక్తులన్నీ పోతాయి. నీ ప్రయాణంలో విజయం సాధించి, తిరిగి



వచ్చేటప్పుడు మీ తల్లిని చూసేముందు, నా దగ్గరికి రా. ఆ వృద్ధురాలు నీ రాకకోసం ఎంత తపిస్తున్నదో, ఏమో!'' అన్నాడు సన్యాసి.

''మహాత్మా! మా తల్లిని గురించి విచారించవలసిన అవసరం లేదు. ఆమె సంరక్షణాబాధ్యతలు రాజుగారే చూసుకుంటున్నారు. మీ ఆజ్ఞానుసారం, నా ప్రయాణం విజయవంతం అయ్యాక, తిరిగి వచ్చి మిమ్మల్నిదర్శిస్తాను. ఆశీర్వదించండి, మహాత్మా!'' అని నమస్కరించాడు మహేంద్రనాధుడు.

సన్యాసి అతన్ని ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. అప్పుడాయన కళ్ళు చెమ్మగిల్లడం చూసి మహేంద్రనాధుడు అమితాశ్చర్యం చెందాడు.

కుటీరం నుంచి వెలుపలికి వచ్చిన మహేంద్రనాధుడు, సేనానాయకుడి సలహాను గుర్తుకు తెచ్చుకుని, పడమటి దిక్కుకేసి బయలుదేరాడు. సరైన మార్గం లేక పోయినప్పటికీ, నడవడానికి అంత కష్టంగా లేదు. కొంతదూరం వెళ్ళాక, ఒక కొండ కనిపించింది. అతడు కొండ మీదికి ఎక్కుతూ, అక్కడక్కడా ఆగి కిందికి చూడసాగాడు. చెట్ల పైకొమ్మలు తప్ప అతడికేమీ కనిపించలేదు. సూర్యాస్తమయమయ్యే సమయానికి కొండశిఖరానికి చేరాడు. ఎదురుగుండా ఎత్తయిన గోడ కనిపించింది. అదొక పెద్ద భవనం ప్రహరీ గోడ అయివుంటుందని అనుకుని, సమీపించి చుట్టూ తిరిగిచూశాడు. ద్వారమార్గం కనిపించలేదు. చీకటి పడుతూ వుండగా ఒకచోట మెట్లు కనిపించాయి. ఆ మెట్లు మీదుగా మహేంద్రనాధుడు తలుపులు మూసిన ఇనుప ద్వారమార్గాన్ని చేరాడు. తలుపులకు బలమైన గొలుసు బిగించి ఉన్నది. అతడు గొలుసులను పట్టుకుని అటూఇటూ గట్టిగా కదిలించాడు. ఆ శబ్దం విని కొంతసేపటికి చేత కాగడాతో ఎవరో వచ్చి కొద్దిగా తలుపు తెరచి, ''మా యజమాని అనుకున్నాను! ఎవరు నువ్వు?

ఎందుకిలా వచ్చావు?'' అని అడిగాడు ఆశ్చర్యంతో.

''నాపేరు మహేంద్రనాధుడు. వీరగిరి రాజ్యానికి చెందినవాణ్ణి. బతుకుతెరువు కోసం హిమగిరి రాజ్యానికి వెళుతున్నాను. ఈ పర్వతమార్గం దగ్గరిదారి అనిచెప్పారు. అయినా, ఇక్కడికి చేరడానికే మూడు రోజులుపట్టింది. పొద్దుపోయింది. లోపలికి అనుమతించావంటే, ఈ రాత్రికి ఇక్కడే వుండి నా దారిన నేను వెళతాను,'' అన్నాడు మహేంద్రనాధుడు.



గొలుసుకు బిగించిన తాళం తీసి, వాడు తలుపు తెరుస్తూ, ''నేనీ భవన ద్వారపాలకుణ్ణి. లోపల నాకొక గది ఉన్నది. నువ్వు ఈ రాత్రికి అక్కడ పడుకోవచ్చు,'' అన్నాడు.

మహేంద్రనాధుడు వాడివెంట లోపలికి వెళ్ళాడు. ద్వారపాలకుడు అతన్ని తన గది లోపలికి తీసుకువెళ్ళి, ''నువ్వు ఇక్కడే కూర్చో. నీకేదైనా తినడానికి తెస్తాను. కొత్తవాళ్ళెవరినీ లోపలికి వదలకూడదని మా యజమాని ఆజ్ఞ. ఆయన ఇప్పుడిక్కడ ఉన్నట్టయితే నిన్ను లోపలికి అనుమతించేవాణ్ణి కాను,'' అన్నాడు.

''నా కారణంగా నువ్వు మీ యజమాని కోపానికి గురికావద్దు. నేను తెల్లవారకముందే వెళ్ళిపోతాను,'' అన్నాడు మహేంద్రనాధుడు.

''అలాగే! మా యజమాని చండశాసనుడే కాని, చాలా మంచి మనిషి. ఏ పరిస్థితిలో నిన్ను లోపలికి అనుమతించానో చెబితే నీమీద కనికరం చూపగల దయామూర్తి. నువ్వేమీ దిగులుపడవద్దు," అని చెప్పి ద్వారపాలకుడు గదినుంచి వెలుపలికి వెళ్ళాడు.

''అరణ్యమధ్యంలో ఎత్తయిన కొండమీద నిర్మానుష్యంగా ఉన్న స్థలంలో ఈ భవనాన్ని ఎందుకు నిర్మించారు? ఈ భవనం యజమాని ఎవరై వుంటాడు? అతడు దయామూర్తి అని ద్వారపాలకుడు

చెబుతున్నాడు. అటువంటివాడు యువ రాణిని అపహరించి తెచ్చి దాచి వుంటాడా?'' అని మహేంద్రనాధుడు రకరకాలుగా ఆలోచించసాగాడు.

ఇంతలో ద్వారపాలకుడు ఒకపళ్ళెంలో ఏవో ఆహారపదార్థాలు తెచ్చి, మహేంద్ర నాధుడి ముందు వుంచి, ''ఈ పూటకు ఇదే లభించింది. దీనితోనే నీ ఆకలి తీర్చు కోవాలి!'' అన్నాడు.

''మీ యజమాని ఎప్పుడు వస్తాడు?'' అని అడిగాడు మహేంద్రనాధుడు యధాలాపంగా.

''ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు వెళతాడో ఎవరికీ తెలియదు. అందువల్ల ఏక్షణంలో నైనా రావచ్చునని మేము సర్వవేళలా ఎంతో జాగ్రత్తగా వుంటాము,'' అన్నాడు ద్వారపాలకుడు.

''మేము, అంటున్నావు. మరి, ఇక్కడ నీతోపాటు ఇంకా ఎందరున్నారు. మీ యజమాని కుటుంబం వాళ్ళున్నారా?'' అని అడిగాడు మహేంద్రనాధుడు.

''మా యజమాని కుటుంబం వాళ్ళంటూ ఇక్కడ ఎవరూలేరు. ఆయన ఈ భవనంలో ఎప్పుడూ ఒంటరిగానే ఉంటారు. ఆయన తన గదిలో తాళపత్ర గ్రంథాలను పరిశీలిస్తూ రోజంతా గడుపుతారట. ఇటీవల ఇక్కడికెవరో ఒక గొప్ప స్త్రీ వచ్చింది. బహుశా ఆమె ఏదో ముఖ్యమైన విషయంలో మా యజమానిని సంప్రదించడానికి వచ్చివుంటుంది. ఆమెవచ్చిన తరవాత ఆయన రెండు రోజులపాటు తన గదినుంచి బయటకు రాలేదు. ఆ తరవాత హడావుడిగా ఎక్కడికో వెళ్ళిపోయాడు. అందుకే, ఆయన ఏక్షణంలోనైనా రావచ్చునని ఎదురుచూస్తున్నాము!'' అన్నాడు ద్వారపాలకుడు.

వాడు ఎవరో గొప్పస్త్రీ వచ్చిందని చెప్పగానే, మహేంద్రనాధుడికి ఆమెయువరాణి అయివుంటుందేమోనన్న అనుమానం కలిగింది. ఎలాగైనా, ఇక్కడే మరి కొన్నాళ్ళు ఉండడం అవసరమని అతడు నిర్ణయించుకున్నాడు. —(ఇంకావుంది)






# వ్యాపారిస్వార్థం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భయం కొలిపే శ్మశానంలో నువ్వు ఇంతగా శ్రమ పడుతున్నావంటే, అందుకు కారణం నువ్వేదో ఒక బృహత్‌కార్యాన్ని సాధించదలిచావని తెలుస్తూనే వున్నది. అయితే, దాన్ని జీవిత కాలంలో సాధించలేనేమో అన్న శంక, నీకెప్పుడైనా కలిగిందా? ఎందుకంటే — చాలామందిలో, తాహతుకు మించిన కోరికలూ, వాటిని నెరవేర్చుకోవాలన్న ఆశా ఉంటుంది. కాని వారిలో తార్కికదృష్టీ, మానవ స్వభావాన్ని గురించిన లోతైన పరిజ్ఞానం లోపించడంతో నిరాశకు గురి అవుతారు. అలాంటివారు తమ జీవితపు చరమదశలో

## బేతాళ కథలు



తాము సాధించలేనిదాన్ని తమ వారసుల ద్వారా అయినా సాధించి తీరాలన్న వ్యామోహానికి లొంగి, అందులోనూ అపజయం పాలవుతారు. ఈ విషయమై ముందుహెచ్చరికగా వుండేందుకు ధనగుప్తుడనే వ్యాపారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకానొకప్పుడు భాగ్యనగరంలో ధనగుప్తుడనే వ్యాపారి వుండేవాడు. ఆయన వ్యాపారంలో ఎంతో సమర్థుడే అయినప్పటికీ బంధుప్రీతి ఎక్కువ. పేదలైన బంధువులపట్ల ఎంతో కనికరం చూపేవాడు. దానిని ఆసరాగా తీసుకుని, చేరదీసిన బంధువులందరూ ఆయనను రకరకాలుగా మోసం చేసి బాగా డబ్బు కాజేశారు. ఈ విషయం గ్రహించే సమయానికి ధనగుప్తుడు చాలా ముసలివాడయ్యాడు.

ధనగుప్తుడికి ఆనందుడు, వినోదుడు, వివేకుడు అనే పేర్లుగల ముగ్గురు కొడుకులున్నారు. ఒకరోజాయన తన ముగ్గురు కొడుకుల్ని దగ్గరకుపిలిచి, ''నాయనలారా! వ్యాపారానికి సమర్థతతోపాటు స్వార్థం కూడా చాలా ముఖ్యం. ముఖ్యంగా బంధువులపట్ల ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. అది లోపించిన కారణంగా, నేను అయినవాళ్ళందర్నీ నమ్మి చాలా నష్టపోయాను. కోట్లకు పడగలెత్తాల్సిన మనం, ఈరోజు లక్షాధికారులుగానైనా మిగిలామంటే, అందుకు మీ సమర్థత కూడా కారణం. కాబట్టి నేనిప్పుడు మిమ్మల్ని ఒక కోరిక కోరుతాను, తీర్చగలరా ?'' అని అడిగాడు.

ముగ్గురు కొడుకులూ వినయంగా, ''వ్యాపారికి స్వార్థం అవసరమని మాకు తెలుసు. మీ పద్ధతులు మాకు నచ్చకపోయినా, మీపై గల గౌరవంకొద్దీ ఈనాటివరకూ మీకెన్నడూ ఎదురు చెప్పలేదు. ఎంత వ్యాపార సామర్థ్యం వున్నవాడయినా, తండ్రివిషయంలో ఏమాత్రం

స్వార్థం చూపకూడదని మా అభిప్రాయం,'' అని తండ్రికి చెప్పి, ఆ కోరిక ఏదైనా సరే తీర్చడానికి సిద్ధంగా వున్నామన్నారు.

ధనగుప్తుడు దీనికెంతో సంతోషించి, ''నా వ్యాపారం రాణించక పోవడానికి కారణం, మన ఇల్లేనని చాలామంది అంటున్నారు. ఈ ఇంటిని స్వయంకృషి వల్ల సంపాదించిన డబ్బుతో ఎంతో కష్టపడి కట్టాను. ఇదంటే నాకెంతో అభిమానం. నా ప్రాణాలీఇంట్లోనే పోవాలని, నా కోరిక. ఈ ఇంటికి స్థలదోషముందని అంతా అంటూంటే నాకెంతో బాధగా వుంది. కొంతమంది స్వార్థపరులీ ఇంటి మీద కన్నేశారు. నన్ను మభ్యపెట్టి ఎలాగైనా సరే ఈ ఇల్లు కొనుక్కోవాలని వాళ్ళ ఆశ! ఈ ఇంటికి స్థలదోషం లేదని మీరు ఋజువు చేయాలి! ఈ ఇంట్లోనే నేను కోటికి పడగలెత్తేలా చేయాలి,'' అని అన్నాడు.

ఆనందుడు, వినోదుడు తండ్రి మాటలకు వెంటనే తలలూపారు. వివేకుడు మాత్రం కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''నాన్నగారూ! పొరపాటు తెలుసుకున్నప్పటికీ, ఈ వయసులో మీరిక మారరు. అయినవాళ్ళ విషయంలో కఠినంగా వ్యవహరించడం మీవల్ల కాదు



కాబట్టి, ముందుగా మీరు వ్యాపారం నుంచి తప్పుకోవాలి.'' అన్నాడు.

ధనగుప్తుడు దీనికి సరేనన్నాక, వివేకుడు మళ్ళీ, ''వ్యాపారం ఒకరి చేతి మీదుగా అయితేనే రాణిస్తుంది. అందువల్ల మా ముగ్గురిలో ఎవరు సమర్థులని తోస్తే, వారికి మీ వ్యాపారాన్ని అప్పగించండి,'' అన్నాడు.

ధనగుప్తుడు దీనికూడా సంతోషంగా అంగీకరించి, ''మీరు ముగ్గురూ కూడా చాలా సమర్థులు, వివేకవంతులు. నా కోరిక ఎవరు తీర్చగలరనుకుంటే వారు ముందుకు రండి. మిగతా ఇద్దరూ స్వతంత్రంగా వ్యాపారం ప్రారం



భించేందుకు నేను సాయం చేస్తాను," అన్నాడు.

ఆయన కొడుకులు ముగ్గురూ కాసేపు సమాలోచన చేశారు. స్వతంత్రంగా వ్యాపారం ప్రారంభించేకంటే, తండ్రి వ్యాపారాన్ని తీసుకోవటమే శ్రేయస్కరంగా కనిపించింది వాళ్ళకు. అందుచేత అప్పటికప్పుడు వాళ్ళేనిర్ణయానికీ రాలేక పోయారు.

అప్పుడు ధనగుప్తుడు," అయితే, నేను మిమ్మల్నొక్క ప్రశ్న వేస్తాను. దానికి సరి అయిన సమాధానం చెప్పినవాడే, నా వ్యాపారానికి వారసుడవుతాడు," అని అన్నాడు.

కొడుకులు ముగ్గురూ దీనికి ఒప్పుకున్నాక, "ఈ క్షణాన మీ ముందు దేవుడు ప్రత్యక్షమై ఏం కావాలి అని అడిగితే, మీరేమి కోరుకుంటారు?" అని ప్రశ్నించాడు ధనగుప్తుడు.

ఆనందుడు వెంటనే, "ఈ ప్రపంచంలోని ధనమంతా నావద్దనే ఉండాలంటాను," అన్నాడు ఎంతో ఉత్సాహంగా.

"ఈ ప్రపంచంలోని ధనమంతా నా వద్దనే తయారుకావాలంటాను," అన్నాడు వినోదుడు.

వివేకుడేమీ మాట్లాడకపోవడం చూసి, ధనగుప్తుడు కుతూహలంగా, "ఈ విషయమై నువ్వేమీ ఆలోచించలేదా?" అని అడిగాడు.

వివేకుడు చిన్నగా నవ్వి, "ఇందులో ఆలోచించడానికేముంది? దేవుడు నిజంగా నాకెదురై నా కోరిక తీర్చుతానంటే, నేను మానవత్వం నిండిన మంచి మనిషికోరేదే కోరుకుంటాను," అన్నాడు.

"అదేమిటో చెప్పు!" అన్నాడు ధనగుప్తుడు మరింత కుతూహలంగా.

"మనుషులందరూ సుఖ శాంతులతో ఆరోగ్యంగా జీవిస్తుండాలన్నది, నాకోరిక" అన్నాడు వివేకుడు.

దీనికి పెద్దవాళ్ళిద్దరూ హేళనగా నవ్వారు.

ధనగుప్తుడు మాత్రం వాణ్ణి మెచ్చుకుని, తన వ్యాపారాన్ని వాడికి అప్పగించాడు.

ఇదిచూసి ఆనందుడు, వినోదుడు తెల్లబోయారు. అప్పుడు ధనగుప్తుడు వాళ్ళతో ఇలా అన్నాడు: "మీ ముగ్గురి సమర్థత గురించి తెలుసుకునేందుకు, నేను మిమ్మల్ని ప్రశ్నలు వేయనవసరం లేదు. చిన్నప్పటినుంచీ మిమ్మల్ని శ్రద్ధగా గమనిస్తున్న నాకు, మీ సమర్థత గురించి పూర్తిగా తెలుసు. కానీ వ్యాపారానికి సమర్థతతోపాటు స్వార్థం కూడా అవసరమని ముందే చెప్పానుగా! అయితే, ఎంత శ్రద్ధగా గమనించినా మనిషిలోని స్వార్థాన్ని తెలుసుకోవడం చాలా కష్టం. ఇలాంటి ప్రశ్నలకు వచ్చే సమాధానాల్లోనే, మనిషి స్వార్థం బయటపడుతుంది. వివేకుడు మీ ఇద్దరికంటే తెలివైన స్వార్థపరుడని అతని సమాధానంద్వారా బైటపడింది. అందుకే వాడికి నా వ్యాపారాన్ని అప్పగిస్తున్నాను," అన్నాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ధనగుప్తుడు ఎంత సమర్థుడైనా, బంధుప్రీతి కారణంగా, వాళ్ళ మోసాలకు గురయి కోటికి పడగలెత్తలేకపోయాడు. అతడు కట్టిన ఇంటికి స్థలదోషం వున్నదని నీలివార్తలు పుట్టించి, దాన్ని చౌకగా కొనుక్కోవాలని కొందరు స్వార్థపరులు ప్రయత్నం చేస్తున్నారు. అతడేమో వృద్ధుడైపోయాడు. అయినా, అతణ్ణి కోటికి పడగలెత్తాలనే ఆశా, వ్యామోహం పట్టి పీడిస్తున్నవి. అలాంటి స్థితిలో సమర్థుడూ, స్వార్థపరుడూ, వివేకీ అయినవాడికి తన వ్యాపార బాధ్యతను అప్పగించి, ఇల్లు పరుల హస్తగతం కాకుండా, తను కోటికి పడగలెత్తాలనేది, అతడి జీవితాశయం! దీన్ని నెరవేర్చుకునేందుకు ఏమాత్రం స్వార్థపరత్వం లేని వివేకుడికి వ్యాపారాన్ని అప్పగించడం, అర్థంలేని పనికదా? వివేకుడికి మనుషులందరూ సుఖశాంతులతో ఆరోగ్యంగా జీవిస్తూ వుండాలన్న

కోర్కె తప్ప, మరే కోరికా లేదని అతడి మాటలద్వారానే తెలుస్తున్నది. అలాంటి వాడికి తన వ్యాపారాన్ని అప్పగించడంలో ధనగుప్తుడు పెద్ద పొరపాటు చేశాడన్న దాంట్లో సందేహానికి తావులేదుకదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "బ్రతుకు తెరువుకు మనుషులు వాళ్ళవాళ్ళ శక్తి సామర్థ్యాలనుబట్టీ, లభ్యమయ్యే అవకాశాలనుబట్టీ, రకరకాల వృత్తులు అవలంబిస్తారు. ఇందులో అందరి అనుభవాలూ ఒకటిగా వుండవు. అంతేకాక, ఆ అనుభవాల నుంచి నేర్చుకునే గుణపాఠాలూ ఒకటిగా వుండవు. వాళ్ళవాళ్ళ మానసికస్థాయిని బట్టి వేరువేరు అంచనాలకూ, నిర్ణయాలకూ వస్తారు. ధనగుప్తుడు తన అనుభవంద్వారా గ్రహించిందేమంటే—వ్యాపారికి సమర్థతతోపాటు స్వార్థంకూడా ముఖ్యమని. తన ప్రశ్నకు పెద్ద కొడుకులిచ్చిన జవాబులు విన్న అతడికి, వాళ్ళు ఒకరిని మించి ఒకరు స్వార్థపరులని తెలిసిపోయింది. అయితే వాళ్ళు మనసులోని మాటను బైటపెట్టి, ధనగుప్తుడి పరీక్షలో ఓడిపోయారు. బయటపడకుండా గోప్యంగా వుండినప్పుడే మనిషికి స్వార్థం రాణిస్తుంది. మూర్ఖుడికి స్వార్థం చెరుపు చేస్తే, వివేకవంతుడికి స్వార్థం మేలుచేస్తుంది. అతడి చిన్న కొడుకైన వివేకుడెంత స్వార్థపరుడంటే, దేవుణ్ణి తను కోరబోయే కోరిక ఏమిటో తండ్రికే తెలియనివ్వలేదు. మనుషులందరూ సుఖశాంతులతో ఆరోగ్యంగా జీవిస్తుండాలన్నది, నిజంగా వాడు దేవుణ్ణి కోరబోయే కోరిక కాదు. అది గ్రహించే ధనగుప్తుడు, వివేకుడికి తన వ్యాపారాన్ని అప్పగించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: జె. శ్రీరామకమల్ రచన]





# మునసబు యుక్తి

ఒకసారి రామశాస్త్రి అనే పండితుడు రాజధానికి వెళ్ళి, రాజుగారి వద్ద తన పాండిత్యాన్ని ప్రదర్శించి, బహుమానం కింద రాజుగారినుంచి కొంత వెండీ, బంగారమూ పుచ్చుకుని తన గ్రామానికి తిరిగి పోతూ, దారిలో తన అన్న ఉండే గ్రామంలో ఆగి, చూసిపోదామని అన్న ఇంటికి వెళ్ళాడు.

రామశాస్త్రి అన్న శివశాస్త్రి గుంభనగా సంసారం గడుపుకుంటూ వస్తున్నప్పటికీ, దినదినగండంగా బ్రతుకు ఈడుస్తూ వస్తున్నాడు. అందుచేత తమ్ముడు ఇంత బంగారమూ, వెండీ తీసుకు వచ్చేసరికి, అతనికి కన్ను కుట్టింది. ఆ రాత్రి తమ్ముడు పడుకుని నిద్రపోగానే శివశాస్త్రి అతని ధనపు మూటను తీసి దాచేశాడు.

మర్నాడు ఉదయం రామశాస్త్రి లేచి తన మూట కోసం చూస్తే అది కనిపించలేదు. ఆ సంగతి అతను అన్నతో చెప్పాడు.

"అరె, ఎంత ప్రమాదం జరిగింది! ఎంత దారుణం! దొంగలు ఎవరో కాజేసి ఉంటారు. ఛీ, ఇలా ఎన్నడూ జరగలేదు. ఎంత అప్రతిష్ట!" అని కల్లబొల్లి మాటలు మాట్లాడాడు శివశాస్త్రి.

రామశాస్త్రికి ఏం చెయ్యడానికీ పాలుపోలేదు. అతను తన అన్న చెప్పిన మాటలు నమ్మకపోగా, ఈ దొంగతనం ఏదో తన అన్నే చేసి ఉంటాడని కూడా అనుమానించాడు. కాని దొంగగా తన అన్నను రచ్చకెక్కించటం అతనికి ఎంత మాత్రమూ ఇష్టం లేదు. శివశాస్త్రి పరువు పోకుండా తన వెండి బంగారాలు, తనకు తిరిగి వచ్చే మార్గం ఏదన్నా చెబుతాడేమోనని రామశాస్త్రి ఆ ఊరి మునసబు వద్దకు పోయి సంగతంతా చెప్పాడు.

మునసబు చాలా తెలివిగలవాడు. ఆయన కొంచెంసేపు ఆలోచించి రామ

శాస్త్రికి ఒక ఉపాయం చెప్పాడు. రామశాస్త్రి ఆ ఉపాయాన్ని ఆమోదించాడు.

మరికొంతసేపటికి ఇద్దరు తలారివాళ్ళు రామశాస్త్రిని పెడరెక్కలు విరిచి కట్టి, మునసబువెంట శివశాస్త్రి ఇంటికి తెచ్చారు. శివశాస్త్రి ఇదంతా చూసి చాలా కంగారు పడ్డాడు. తన తమ్ముడు ఏమి నేరం చేశాడో అతనికి అర్థం కాలేదు. కాని రామశాస్త్రి ఏదో నేరం చేసిన వాడిలాగే, అన్న ముఖం చూడలేనట్టు తలవంచేసుకుని, విచారంగా నిలబడ్డాడు.

మునసబు శివశాస్త్రితో, "చూడండి, శివశాస్త్రిగారూ! మీ తమ్ముడు ఇంత పని చేశాడంటే, నాకే నమ్మశక్యం కాకుండా ఉన్నది. కాని ఇంతకు ముందే రాజధాని నుంచి వార్త వచ్చింది. అక్కడ మీవాడు బంగారం దొంగిలించాడట. అతను ఈ గ్రామం కేసి వచ్చినట్టు రుజువయిందట. అతను కిందటి రాత్రి మీ ఇంట్లో పడుకున్నాడు గనక, దాన్ని ఎక్కడైనా దాచాడేమో సోదా చెయ్యటం నా విధి. మీ ఇల్లు సోదా చెయ్యవలసి వచ్చినందుకు నేనెంతో బాధ పడుతున్నాను. కాని ఏం చెయ్యను? ఉద్యోగధర్మం. తప్పదు! నాకు మీరు సహాయం చెయ్యాలి," అన్నాడు.

ఆయన రామశాస్త్రిని తన వెంట తీసుకుపోతూ తలారి వాళ్ళను అక్కడే ఉంచి, ఇల్లు సోదా చెయ్యటానికి మనుషులను పంపుతానన్నాడు.

ఆ మనుషులు వచ్చే లోపల శివశాస్త్రి తాను దాచిన వెండి బంగారాల మూటను తెచ్చి, రామశాస్త్రి పడుకున్న చోట పెట్టేశాడు. మునసబు పంపిన మనుషులకు ఆ మూట దొరికింది. వాళ్ళు దాన్ని మునసబు ఇంటికి తీసుకుపోయారు.

తరవాత కొంతసేపటికి రామశాస్త్రి అదే మూటతో సహా అన్న వద్దకు తిరిగి వచ్చి, "మునసబుగారు పొరబడ్డారు. నేను నిర్దోషినని రుజువయింది. ఇది రాజుగారు నిజంగా నాకిచ్చిన బహుమానమే. నే నిక వెళ్ళి వస్తాను," అంటూ అన్నవద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.



# చందమామ
# అనుబంధం—48



## మనదేశపు పక్షులు-జంతువులు: పండాలు

ఆస్ట్రేలియాకు చెందిన కోలా ఎలుగుబంటుల్లాగా మనదేశంలోని పండాలు చాలా అందంగా ఉంటాయి. గుండ్రటి తలతో, పొట్టి కాళ్ళతో ఇవి చూడడానికి చాలా ముచ్చటగా ఉంటాయి. గచ్చకాయ రంగులో ఉండే వీటి శరీరం దాదాపు 60 సెం. మీ. పొడవూ, తోక 40 సెం.మీ. పొడవూ ఉంటాయి. వీటి చెవులు కాస్త పెద్దవిగానూ నిక్కబొడుచుకునీ ఉంటాయి; కాని మొనదేలి ఉండవు. మోర బొద్దుగానూ, తోక వంకరతిరిగి ఉంటాయి. తోక ఊదా రంగులో ఉంటుంది. కింది శరీరం నల్లగానూ, తల తెల్లగానూ ఉంటుంది.

ఉత్తర భారతదేశం ఎత్తయిన పర్వత ప్రాంతాలలో నివసించే పండాలు, పగటిపూట చెట్లకొమ్మలపైన పడుకుని, హాయిగా నిద్రపోతాయి. రాత్రి కాగానే ఆహార సంపాదనకు బయలుదేరతాయి. ఇవి వెదురుజాతి మొక్కలనూ, పళ్ళనూ, దుంపలనూ తింటాయి. ఒక్కొక్కసారి పక్షుల గుడ్లనుకూడా తింటాయి. పక్షులుచేసే ధ్వనిలాగా ఇవి మెల్లగా ఈల వేస్తాయి. వీటి శరీరంమీది ఒకరకం ఉన్ని, చాలా విలువైనది.

పండా బొమ్మలంటే పిల్లలకు చాలా ఇష్టం. మన మాజీ ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ, 'తీన్‌మూర్తి భవన్'లోని ఉద్యానవనంలో పెంచే పండాలతో తరచూ ఆడుకునేవారు.



# మన సమకాలీన సాహిత్యం

బెంగాల్‌లోని ఒక గ్రామం నేపథ్యంగా ఈ కథ సాగింది. కథాకాలం—1920వ సంవత్స ప్రాంతం.

శివపూర్ గ్రామవాసి అయిన శ్రీహరి కరుడుగట్టిన స్వార్థపరుడు. ఎదుటివారిని మోసగించయినా సరే ధనవంతుడై పోవాలనీ, గ్రామంలో పెద్దమనిషిగా పేరు తెచ్చుకోవాలనీ శ్రీహరి తపించిపోయేవాడు. అందువల్ల తనను వ్యతిరేకించే వాళ్ళను నిర్దాక్షిణ్యంగా నాశనం చేసేవాడు. తన స్వార్థ పథకాలకు అడ్డుతగిలే పేదల ఇళ్ళకు నిప్పంటించే పరమ నీచుడు శ్రీహరి.

## తారాశంకర్ బందోపాధ్యాయ 'గణదేవత'



అటువంటి నీచస్వభావుడైన శ్రీహరి, ఒకసారి పేదలు బాధపడుతూండగా సాయపడ్డాడు. అంతకు పూర్వం ఎలాంటి వాడయినప్పటికీ క్లిష్టదశలో సాయపడిన శ్రీహరిని గ్రామ ప్రజలు ఎంతగానో మెచ్చుకున్నారు. అతని మంచితనాన్ని అతని ఎదుటే పొగడడంతో, అతడు పొంగిపోయాడు. అతనిలో పెద్దమనిషి కావాలన్న పేరాశ పుట్టుకువచ్చింది.

ఆ కాలఘట్టంలోనే, గ్రామ ప్రజలలో నూతన చైతన్యం వికసించసాగింది. తమ శ్రమకు తగిన డబ్బు సక్రమంగా ముట్టచెబితే తప్ప, గ్రామప్రజలకు పనులు చేయడానికి గ్రామంలోని కమ్మరీ, మంగలీ విముఖత చూపసాగారు. ఆ కారణంగా గ్రామంలో తరచూ గొడవలూ, కొట్లాటలూ అరంభమయ్యాయి.

గ్రామ ప్రజలలో అధికసంఖ్యాకులు సహజమైన ఆశా నిరాశలకు, భయాందోళనలకు లోనైనవాళ్ళే. కాని, కొందరు మాత్రం ఉన్నతమైన అదర్శాలతో విలక్షణంగా కనిపించారు. అలాంటివారిలో ఉపాధ్యాయుడు దేబు ఒకడు. ఉత్తమ గుణాలకూ, ధైర్య సాహసాలకూ ఆయన పెట్టింది పేరు. మరొకాయన డాక్టర్ జగన్. ఆయన పేదసాదలకు ఎంతో శ్రద్ధగా వైద్యం చూసే డాక్టర్ మాత్రమే కాదు; పదిమందికి మేలుచేయడానికీ, జాతి ఔన్నత్యానికీ అహర్నిశలు కృషిచేస్తున్న అదర్శమూర్తి.



ఒకనాడు గ్రామ భూములను సర్వే చేయడానికి, ప్రభుత్వ అధికారులు కొందరు వచ్చారు. అలా వచ్చిన వాళ్ళల్లో ఒకడు దేబుతో దురుసుగా వ్యవహరించాడు. దేబు నిరసన తెలియజేయడంతో, వాడు ఆగ్రహం చెంది ఆయనమీద తప్పుడు కేసు పెట్టాడు. అప్పటికే ప్రజలలో పరాయి పాలన పట్ల వ్యతిరేకత వ్యాపించి ఉన్నది. దేబు ప్రజల ధైర్యానికి సంకేతం అయ్యాడు. ఆయనను ఖైదుచేసి తీసుకుపోవడానికి పోలీసులు వచ్చినప్పుడు, గ్రామ ప్రజలు అతన్ని కీర్తిస్తూ, ఏకకంఠంతో నినాదాలు చేశారు.

ఒక సంవత్సరం తరవాత దేబును జైలునుంచి విడుదల చేశారు. ఆయనను చూడగానే గ్రామ ప్రజలు పరమానందం చెందారు. అప్పుడే ఆ గ్రామానికి, జతిన్ అనే యువకుడు వచ్చాడు. అతడు విప్లవకారుడు. పాత జమీందారునుంచి మొత్తం జమీందారీని కొన్న శ్రీహరి ఆ ఊరి కొత్త జమీందారు అయ్యాడు. ఎవరి అధీనంలోనూ లేని బంజరుభూములు చట్టప్రకారం జమీందారుకే చెందుతాయి. అయినా, గ్రామప్రజలు తమ గొడ్డూగోదా మేపుకోవడానికి ఆ భూములను ఉపయోగించుకునేవాళ్ళు. అక్కడి చెట్లను అందరికీ చెందిన ఉమ్మడి ఆస్తిగానే భావించేవాళ్ళు. కొత్తగా జమీందారయిన శ్రీహరి అక్కడి చెట్లను సొంతానికి నరకడం ప్రారంభించాడు. గ్రామస్థులు ఆక్షేపించారు. దాని కారణంగా జరిగిన గొడవలో దేబు గాయపడ్డాడు. ఆ రోజు రాత్రే శ్రీహరి తోటలో కొత్తగా నాటిన మొక్కలను ఎవరో నాశపరిచారు. ఆ నింద దేబుమీద పడింది. ఆయనను ఖైదుచేయడానికి మళ్ళీ పోలీసులు వచ్చారు. అయితే, అసలు నేరస్థుడైన ఆ గ్రామానికే చెందిన అనిరుద్ధ అనే కమ్మరి యువకుడు నేరాన్ని ఒప్పుకోవడంతో పోలీసులు అతన్ని ఖైదుచేసి తీసుకువెళ్ళారు.

హఠాత్తుగా ఆ గ్రామంలో కలరావ్యాధి వ్యాపించింది. జననష్టం కలిగించింది. శవాలను దహనం చేయడానికి దేబు సాయపడ్డాడు. ఆయన ఇంటికి రాగానే ఆయనతోపాటు వచ్చిన కలరా వ్యాధిక్రిములు ఆయన బిడ్డకుసోకాయి. బిడ్డ మరణించాడు. ఆ తరవాత దేబు భార్యకూడా కలరా వ్యాధితోనే పోయింది.

దేబు ఒంటరివాడయ్యాడు. జతిన్ ఆ గ్రామం వదిలిపెట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. దాంతో ఉన్న ఒక్క మిత్రుడు కూడా దూరం కావడంతో దేబు మరీ ఒంటరితనానికి లోనయ్యాడు.

అయినా, అదీ జీవితం! జీవితం నలువైపులనుంచీ ముట్టడి! నిరంతర పోరాటం! సాధారణమైన సుఖసంతోషాలకు పాకులాడడంకన్నా, తాను విశ్వసించే ఉన్నత ఆదర్శాల కోసం పోరాటం సాగించడంలోనే మనిషికి నిజమైన శక్తి లభిస్తుందని రచయిత ఈ నవలద్వారా తేటతెల్లం చేశారు.

తారాశంకర్ బందోపాధ్యాయ (1898–1971) వంగ భాషలో చాలా కథలూ, నవలలూ, రాసిన సుప్రసిద్ధ రచయిత. ఆయన రచించిన ఈ 'గణదేవత' నవలకు 1967 వ సం॥లో భారతీయ జ్ఞానపీఠ పురస్కారం లభించింది.

# మీకు తెలుసా?

1. ప్రపంచంమొత్తం మీద నదీమధ్యంలో కొండ మీద రెండేరెండు పురాతన వస్తుప్రదర్శన శాలలు ఉన్నాయి. వాటిలో ఒకటి ఈజిప్టులో అబూ సింబెల్ సమీపంలో ఉన్నది. మరొకటి ఇండియాలో ఉన్నది. అది ఏదో మీకు తెలుసా ?
2. ఒక నగరం సమీపంలోని చిన్న కొండమీద వెలసిన దేవాలయానికి వెయ్యి మెట్లున్నాయి. ఆ ఆలయం ఏది ?
3. స్టాంపుల మీద తనపేరు ముద్రించని దేశం ఏది ?
4. మన జాతీయపతాకం మధ్యలో ఉన్న చిహ్నం ఏమిటి ?
5. మియాన్‌మార్ (బర్మా)లో వాడుకలో ఉన్న ద్రవ్యం (కరెన్సీ) ఏది ?
6. 'రెడ్‌క్రాస్'ను స్థాపించిన వారెవరు ?
7. ఎల్. ఇ. వాటర్మన్ ఏ విషయంలో ప్రసిద్ధుడు ?
8. శిక్కుల తొమ్మిదవ గురువు ఎవరు ?
9. అమీర్ ఖుస్రో ఉపయోగించిన సంగీత వాయిద్యం ఏది ?
10. మనదేశంలో జీడిపప్పును ఎక్కువగా ఎగుమతి చేసే రాష్ట్రం ఏది ?
11. 'ఐఫిల్ టవర్' ఎక్కడ ఉన్నది ? దానిని ఎవరు నిర్మించారు ?
12. సుప్రసిద్ధమైన డా॥ శామ్యుల్ జాన్సన్ జీవితచరిత్రను ఎవరు రాశారు ?
13. మనదేశంలో మొట్టమొదట నాణాలు ఏ కాలఘట్టంలో వాడుకలోకి వచ్చాయి ?
14. ఒక దేశభక్తుడు నిరాహారదీక్ష వహించి, జైలులోనే ప్రాణాలు వదిలాడు. ఆయన ఎవరు ?
15. 'రజతవిప్లవం' అంటే ఏమిటి ?

## సమాధానాలు

1. ఆంధ్రప్రదేశ్‌లోని నాగార్జున కొండ.
2. మైసూరు సమీపంలోని చాముండేశ్వరి ఆలయం.
3. గ్రేట్‌బ్రిటన్.
4. అశోకచక్రం.
5. క్యాత్.
6. జీన్ హెన్రీ డ్యూరంట్.
7. ఫౌంటెన్ పెన్ను కనుగొన్నారు.
8. గురు తేజ్ బహదూర్.
9. 'సరోద్'
10. కేరళ.
11. ప్యారిస్ నగరంలోని 985 అడుగుల ఎత్తయిన గోపురం. దానిని 1887-89 మధ్య గస్టావ్ ఐఫిల్ నిర్మించారు.
12. జేమ్స్ బోస్వెల్.
13. క్రీ. పూ. 5వ శతాబ్దం.
14. జతిన్‌దాస్.
15. పాడిపరిశ్రమాభివృద్ధి.



# మేధావి

చలపతి అనే యువకుడికి గ్రాహ్యశక్తి ఎక్కువ. ఏది చదివినా వెంటనే అర్థమై పోతుంది. ఒకసారి విన్న మాట కలకాలం గుర్తుండిపోతుంది. పిన్నతనంలోనే వాణ్ణి మహామేధావి అని చాలామంది అనేవారు. ఎంతమంది మెచ్చుకున్నా అతడి తండ్రి మాత్రం, ''ఈ ఊళ్ళో అసలుసిసలు మేధావి సునందుడు. ఆయన మెచ్చుకుంటేనే, నువ్వు మేధావిక్రింద లెక్క!'' అన్నాడు.

చలపతి ఒకనాడు వెళ్ళి సునందుణ్ణి కలుసుకున్నాడు. సునందుడు వాణ్ణి పలువిధాల ప్రశ్నించి, ''నీ పరిజ్ఞానం, జ్ఞాపకం కూడా మెచ్చుకోతగ్గవి. ఊరి పెద్దలందర్నీ ఒకచోట సమావేశపరిచి, వారిముందు మనమిద్దరమూ పోటీ పడదాం. బహుశా, నువ్వే నన్ను గెలుస్తావు,'' అన్నాడు.

అప్పుడు చలపతికి కలిగిన ఆనందం అంతాయింతా కాదు. ఇంటికివెళ్ళి వాడు, తండ్రికి జరిగింది చెబితే ఆయన, ''ఇందులో ఏదో తిరకాసుంటుంది. నువ్వు బాగా ఆలోచించుకో,'' అని హెచ్చరించాడు.

చలపతి, తండ్రి మాటను లెక్క చెయ్యలేదు.

ఈ పోటీని చూడాలని ఊళ్ళోవాళ్ళందరూ సరదాపడ్డారు.

పోటీ రోజున జనం తండోపతండాలుగా వచ్చారు.

సునందుడు ముందుగా చలపతి నేమైనా ప్రశ్నలు వేయమన్నాడు. చలపతి వెంటనే, ''సూర్యుడి తేజస్సు ఎక్కడిది?'' అన్నాడు.

అందరూ సునందుడేం చెబుతాడోనని కుతూహలంగా ఎదురు చూశారు.

"వసుంధర"

సునందుడు చికాకుపడి, "సూర్యుడి తేజస్సు ఎక్కడిదని, ఇక్కడి వాళ్ళలో ఎవరినడిగినా అందరూ తలో రకంగా జవాబు చెబుతారు. ఎందుకంటే సూర్యుడి తేజస్సు ఎక్కడిదో తెలుసుకునేందుకు ఊహ కావాలి. అయితే, ఊహ అందరిదీ ఒకేలాగా ఉండదు. అందులోని నిజానిజాలు తేల్చడానికి మనం సూర్యుడి దగ్గిరకు వెళ్ళలేము. ఒకవేళ వెళ్ళినా బ్రతకనూలేము. శాస్త్రప్రకారం సూర్యుడి తేజస్సుకు కారణాలు చెప్పినా అది నీకూ, నాకూ తప్ప ఇంకెవరికీ అర్థంకావు. ఇక్కడ చేరిన వారందరికీ అర్థమయ్యే ప్రశ్నలు వేయాలని నీకు తెలియదా?" అన్నాడు.

చలపతికి ఏమనాలో తోచక, ఒక్క క్షణం ఆలోచించి, "పోనీ మీరే ఒక ప్రశ్న వేయండి." అన్నాడు.

సునందుడు వెంటనే, "చంద్రుడి కాంతి ఎలా వచ్చింది?" అని అడిగాడు.

చలపతి తటపటాయించకుండా, "ఇక్కడి వాళ్ళకు అర్థమయ్యేలాంటి ప్రశ్నలే వేయాలని, మీరూ గుర్తుంచుకోవాలి!" అన్నాడు.

సునందుడు నవ్వి, "ఏం నీకు మనూరి వాళ్ళు తెలివి తక్కువ వాళ్ళుగా తోస్తున్నారా? చంద్రుడికి స్వయంప్రకాశం లేదనీ, సూర్యకాంతి చంద్రుడిపై పడి ప్రతిఫలించి వెన్నెలగా భూమిని చేరుతుందనీ, నీకు తెలియకపోవచ్చు, కానీ



మన ఊళ్ళో అందరికీ తెలుసు. ఏం, రామయ్యా! నీకు తెలియదూ? ఏం, వీర్రాజూ, నీకు తెలియదూ?'' అంటూ గ్రామస్తు లొక్కొక్కర్నే అడగసాగాడు.

అందరూ తెలుసునన్నట్టు తలలు ఊపారు.

చలపతి ఉక్రోషంగా, ''మరి ఇందాక అలా అన్నారు?'' అని ప్రశ్నించాడు.

''అంటే ఊరుకోవడమేనా? ఈ ఊరికి మనిద్దరమేనా తెలివైన వాళ్ళం!'' అని సునందుడు ఊరివాళ్ళవైపు తిరిగి, ''ఈ చలపతికి కాస్త తెలివి వుంటే వుందేమో కానీ వినయగుణం లేదు. తనంతటివాడు లేడని అహంకారం. ఊళ్ళో అంతా తెలివి లేని వాళ్ళని అనుమానం. ఇంత చిన్న వయసులోనే ఇంత మిడిసిపాటు ఎవరికో గానీ వుండదు. నాతో పోటీ పడాలని వీడి కింత తపన ఎందుకు? నా దారిన నన్ను పోనిచ్చి, తన దారిన తను పోవచ్చు గదా!'' అన్నాడు.

గ్రామస్థులందరూ కలిసి, చలపతిని నానా మాటలూ అని ఎద్దేవా చేశారు.

వాడికి చచ్చేటంత అవమానమయింది. వాడు ఇంటికి వెళ్ళాక, తండ్రి చీవాట్లు పెట్టి, ''సునందుడి ముందు నువ్వు చాలవు. నామాట వినక భంగపడ్డావు.'' అన్నాడు.

అందుకు చలపతి, ''సునందుడిలాంటి వాడని నేను అనుకోలేదు. ఆయనకు తగిన విధంగా బుద్ధి చెప్పడమే, ఇకమీదట నా జీవితాశయం,'' అన్నాడు.



ఆ రోజు నుంచీ వాడు సునందుడి ప్రతి మాటనూ శ్రద్ధగా వింటూ, ప్రతి చేష్టనూ శ్రద్ధగా గమనిస్తూ, ఆయన రాసిన గ్రంథాలన్నీ తదేక దీక్షతో చదవసాగాడు. ఈ విధంగా చలపతికి, ఆయన మాటల్లో, ప్రవర్తనలో, ఆలోచనల్లో ఎన్నో లోపాలు స్పష్టంగా కనిపించసాగాయి. వాటికి వాడు ఊళ్ళో విపరీతమైన ప్రచారం కల్పించసాగాడు.

ఊళ్ళో వాళ్ళు కొందరు ఒకనాడు సునందుడి వద్దకు వెళ్ళి, చలపతి అంటున్న మాటలు అతనికి చెప్పి ఎంతో బాధపడ్డారు.

సునందుడు వాళ్ళను సముదాయించి, "చలపతి తెలివైనవాడు. నా లోపాలు వాడు చూపిస్తే నాకూ మంచిది. వాటిని సవరించుకుని బాగుపడతాను. ఉత్త పుణ్యాన లేని లోపాలను వాడు లోపాలంటాడా—అందువల్ల వాడి కుత్సితబుద్ధే బయటపడుతుంది తప్ప, నాకేం నష్టం?" అన్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయాక సునందుడి భార్య, ఆయనతో, "ఇప్పుడు మీరు చూపించిన శాంతం మొదట్లో చూపించి ఉంటే, చలపతి మీకు శత్రువై వుండేవాడు కాదు. వాడు మీ గురించి చేస్తున్న దుష్ప్రచారం నాకెంతో దుఃఖాన్ని కలిగిస్తున్నది." అని చెప్పింది.

సునందుడు చిన్నగా నవ్వి, "వెర్రిదానా! నేను కావాలనే చలపతిని రెచ్చగొట్టాను. ఎందుకంటే, వాడు నిజంగానే మహామేధావి. నేనుండగా ఈ ఊళ్ళో నాకంటే గొప్ప మేధావి మరొకడు వుండకూడదని నాకోరిక. అందుకే వాణ్ణి బాగా రెచ్చగొట్టాను. ఆవేశం మేధావుల్ని కూడా మూర్ఖుల్ని చేస్తుందనటానికి, చలపతే ఉదాహరణ. చలపతి బుద్ధి ఇప్పుడు పెడదారి పట్టింది. నన్ను దుయ్యబట్టడానికే వాడు, తన తెలివినంతా ఉపయోగిస్తున్నాడు, అందువల్ల మేధావిగా, ఈ ఊళ్ళో నాకుపోటీలేదు. అర్థమయిందా?" అన్నాడు.





# వైద్యుడి పొగరు

ముదినేపల్లి అనే గ్రామంలో, శేషాచలపతి అనే గొప్ప వైద్యుడుండేవాడు. ఆయన వ్రణవైద్యంలో మంచి దిట్ట. ఆయన చెయ్యి తగలగానే ఎంత భయంకరమైన వ్రణమైనా, ఇట్టే తగ్గుముఖం పడుతుందని చెప్పుకునేవారు.

ఒకసారి, శేషాచలపతి వుండే ప్రాంతాన్ని పాలించే రాజు, రాచపుండు వ్యాధికి గురయ్యాడు. వీపున లేచిన ఆ పుండు, రాజును నరకయాతన పాలుచేయసాగింది. ఆస్థానవైద్యుడు ఎన్నో రకాల మూలికలువాడి చికిత్సచేసినా ప్రయోజనం లేకపోయింది. ఆ పరిస్థితుల్లో శేషాచలపతి ప్రశస్తి, ఆ నోటా ఈ నోటా రాజాంతఃపురం చేరింది. రాజు, శేషాచలపతి గురించి విని, విరక్తిగా నవ్వి, "సరే, ఏ పుట్టలో ఏ పాము వున్నదో! చూద్దాం, ఆ వైద్యుడికి కబురు చేయండి," అని మంత్రికి చెప్పాడు.

మంత్రి ఆజ్ఞ మేరకు రాజభటులు పల్లకీ తీసుకుని, శేషాచలపతి వుండే ముదినేపల్లి గ్రామం చేరి, ఆయనకు రాజాహ్వానాన్ని వివరించారు. తన వైద్యప్రావీణ్యం రాజ్యాన్నేలే రాజువరకూ పాకినందుకు శేషాచలపతి ఎంతగానో సంతోషించాడు.

అయితే, ఆయన ప్రయాణానికి సిద్ధపడుతున్న సమయంలో ఒక ఆలోచన వచ్చింది. ఆ కారణంగా ఆయన భటుల వెంట రాజధానికి వెళ్ళడానికి నిరాకరిస్తూ, "మహారాజుగారికి నా వైద్యంలో అంతగా గురి వుంటే, ఆయన్నే ఇక్కడికి రమ్మని చెప్పండి," అన్నాడు.

ఇది విన్న భటులకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు. మహారాజుగారి ఆహ్వానాన్ని తిరస్కరిస్తున్న వైద్యుడి ధైర్యం ఏమిటో, వాళ్ళకు అర్థం కాలేదు: వాళ్ళు తిరిగి

దాసరి వెంకటరమణ



వచ్చి, రాజుకు జరిగిన సంగతి విన్న వించుకున్నారు.

ఆ సమయంలో అక్కడ ఉన్న సేనాపతి ఉగ్రుడైపోయి, "ఏమిటీ! పిచ్చి మొక్కలతో పసర్లు పిండుకునే, ఒక గ్రామవైద్యుడికి ఎంత పొగరు? మహారాజా, ఇప్పుడే వాణ్ణి బంధించి రాజధానికి తెప్పిస్తాను," అన్నాడు.

రాజు అతణ్ణి వారిస్తూ, "పిచ్చి మొక్కల్లోంచి అమూల్యమైన మూలికల్ని గుర్తించగల, అతడి నైపుణ్యాన్ని మనం గౌరవించాలి. నేను వెంటనే వైద్యుడుండే గ్రామం వెళ్ళదలిచాను. అందుకవసరమైన ఏర్పాట్లు చెయ్యండి," అన్నాడు.

రాజు కొద్దిపాటి పరివారంతో పల్లకీలో గ్రామం చేరుకుని, గ్రామం వెలుపల ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన విడిదిలో దిగాడు.

సేనాపతి, శేషాచలపతి ఇంటికి వెళ్ళి, "ఏమండీ, మహారాజుగారు మీ గ్రామం శివారు వరకూ వచ్చారు. అది సరిపోతుందా లేక తమ భవనానికి రమ్మంటారా ?" అని హేళనగా అడిగాడు.

శేషాచలపతి, సేనాపతి మాటల్ని ఏమాత్రం పట్టించుకోకుండా, రాజుగారి విడిదికి వెళ్ళి, ఆయనకు వినయంగా నమస్కరించి, వ్రణాన్ని పరీక్షించి వైద్యం ప్రారంభిస్తూ, "మహారాజా! వ్యాధి నివారణకు చికిత్స ఎంత ప్రధానమో, పథ్యం కూడా అంతే ప్రధానం, అందువల్ల, తమరు మా ఇంటినుంచి పంపే ఆహారాన్నే భుజించాలి. కఠిన పథ్యం కనక, రెండు వారాలపాటు జిహ్వాచాపల్యాన్ని చంపుకోక తప్పదు," అని చెప్పాడు.

ఆ తర్వాత శేషాచలపతి ఎన్నో అరుదైన మూలికల్ని కష్టపడి సంపాదించి, శ్రద్ధగా వైద్యం చేశాడు. వారం రోజుల్లో వ్రణం తగ్గుముఖం పట్టి, మరొక వారానికిపూర్తిగా మాడిపోయింది.

రాజు, శేషాచలపతిని ఎంతగానో మెచ్చుకుని, "వైద్యంలో మీ ప్రతిభ

అపూర్వం. ప్రతిఫలంగా నేను ఏమిచ్చినా, మీ ఋణం తీర్చుకోగలనని గాదు. నా తృప్తికోసం చెబుతున్నాను. మీకెంత ధనం కావాలో కోరుకోండి. ఖజానానుంచి పంపగలను,'' అన్నాడు.

శేషాచలపతి వినయంగా, ''ప్రభూ! నాకు కొన్ని పంట పొలాలూ, పండ్ల తోటలూ వున్నవి. వాటిమీద వచ్చే ఆదాయంతో నా జీవితం సుఖంగా సాగిపోతున్నది. కనుక, ఈ దేశాన్నేలే మహారాజులనుంచి వైద్యానికిగాను ప్రతిఫలంగా ధనం పుచ్చుకోలేను. కాని, తమరు నా కోర్కెనొకదాన్ని మన్నించాలి,'' అన్నాడు.

''ఏమిటది?'' అని రాజు ఆశ్చర్యంగా అడిగాడు.

''తమరు మా గ్రామానికి పల్లకీలో వచ్చారు. ఈసారి అలాకాక వెళ్ళేటప్పుడు రథంమీద వెళ్ళండి,'' అన్నాడు శేషాచలపతి. ఆ తర్వాత ఆయన రాజుకు ఒక ఉత్తరం ఇస్తూ, ''ప్రభూ! నా ప్రవర్తనలో ఏదైనా అసహజత్వం కనిపించి, మిమ్మల్ని బాధించి వుంటే క్షమించండి! అలా రథంలో ప్రయాణం చేయమనడంలో, నా అభిప్రాయం రాజధాని చేరేలోగా బోధ పడనట్లయితే, అప్పుడు నేనిచ్చిన ఉత్తరం చదవండి,'' అనికోరాడు.

రాజూ, సేనాపతీ రథంలో, రాజధానికి బయలుదేరారు. దారంతా ఎగుడు దిగుళ్ళతో, గతుకులతోవుండి, ప్రయాణం చాలా ప్రయాసగా వున్నది. రాజుకు శరీర



శ్రమ కలిగించడమే, ఆ పొగరుబోతు వైద్యుడి ఉద్దేశం, అనుకున్నాడు సేనాపతి.

అతడు రాజుతో, "మహారాజా, చూశారా! ఆ పొగరుబోతు వైద్యుడు పని గట్టుకుని తమరిని తన గ్రామానికి పిలిపించడమే గాక, ఇప్పుడు ఈ గతుకుల దారిలో వెళ్ళమని సలహా ఇచ్చాడు. ఏదీ, ఆ ఉత్తరం ఇవ్వండి, అందులో ఏమున్నదో చూస్తాను," అన్నాడు.

"వద్దు. వైద్యుడు ఉత్తరంలో ఏంరాశాడో నాకు బోధపడింది!" అన్నాడు రాజు.

రాజధాని చేరుతూనే, మంత్రిని పిలిచి, "వెంటనే ముదినేపల్లి ప్రాంతపు మన ప్రతినిధిని రప్పించండి. గతంలో ఆ గ్రామానికి రహదారి నిర్మించేందుకు, అతడికి ఇచ్చిన నిధులు ఏమైనవో విచారించండి," అని చెప్పాడు.

తర్వాత ఆయన, సేనాపతితో, "వైద్యుడు శేషాచలపతి చాలా తెలివైన సున్నిత మనస్కుడు. ఆ గ్రామం రహదారి నిర్మాణ విషయంలో జరిగిన అవకతవకలను గురించి, ఆ గ్రామాధికారి లోగడ మనకు కొంత గోప్యంగా తెలియజెప్పాలని చూశాడు. మనం పట్టించుకోలేదు. వైద్యుడి ఉత్తరం చదువు, సంగతేమిటో నీకే తెలుస్తుంది," అన్నాడు.

సేనాపతి ఆ ఉత్తరం చదివాడు. అందులో ఇలా ఉన్నది: "ప్రభూ! ప్రయాణంలో మీకు కలిగించిన శ్రమకు నన్ను మన్నించండి. నా దగ్గిరకు వచ్చే అనేకమంది రోగులు రోజూ పడుతున్న శ్రమను మీరూ అనుభవించారు. దయచేసి వాళ్ళకు న్యాయం చేయండి!"

ఉత్తరం చదివి ఆశ్చర్యంగా చూస్తున్న సేనాపతితో, రాజు, "ఇప్పటికైనా ఆ వైద్యుడి పొగరుకు కారణం అర్థమైందా?" అన్నాడు.

ఇది జరిగాక నెల తిరక్కుండానే, రాజధానినుంచి ముదినేపల్లి గ్రామానికి చక్కని రహదారి వేయడమేగాక, ప్రయాణీకుల సౌకర్యం కోసం అక్కడక్కడా సత్రాలు కూడా నిర్మించబడినై.






దుఃఖంలో ఉన్న రాముడికి విభీషణుడు ఏమి చెబుతున్నదీ అర్థం కాలేదు. అందుచేత అతను కొంతసేపటికి తనను తాను నిగ్రహించుకుని, "విభీషణా, ఇప్పుడేమిటో చెప్పావు. నాకు సరిగా తెలియలేదు. మళ్ళీ చెప్పు," అన్నాడు.

దానికి విభీషణుడు ఇలా అన్నాడు:

"నువ్వు నిష్కారణంగా దుఃఖిస్తూ, మాకు కూడా దుఃఖం కలిగిస్తున్నావు. సంతోషిస్తున్నది నీ శత్రువులు మాత్రమే. రాక్షసులను చంపటమూ, సీతను తిరిగి పొందటమూ నీ కోరిక అయిన పక్షంలో యుద్ధప్రయత్నం చెయ్యి. లక్ష్మణుణ్ణి వానరసేనతో సహా నికుంభిలకు పంపి, ఇంద్రజిత్తుతో యుద్ధంచేసి, అతన్ని చంపమను. ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికి నికుంభిలకు వెళ్ళాడు. అతను ఆ హోమం పూర్తిచేశాడంటే మనందరికీ చావు తప్పదు. అది బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తుకు ఇచ్చిన వరం. అతని నికుంభిలా హోమానికి ఆటంకం కలిగించిన వాడి చేతిలో ఇంద్రజిత్తు చస్తాడు. ఇంద్రజిత్తు చచ్చాడంటే, రావణుడూ, అతని మిత్రులూ చచ్చినవాళ్ళ కిందనే లెక్క."

రాముడు లక్ష్మణుడితో ఇంద్రజిత్తును చంపి రమ్మన్నాడు. అందుకుగాను లక్ష్మణుడు బలమైన వానర, భల్లూక సేనలను వెంట తీసుకుపోయేటట్టూ, నికుంభిలకు దారి చూపటానికి విభీష



ణుడు లక్ష్మణుడి వెంట వెళ్ళేటట్టూ ఏర్పాటు జరిగింది. లక్ష్మణుడి వెంట హనుమంతుడు కూడా బయలుదేరాడు.

బయలుదేరేటప్పుడు లక్ష్మణుడు బంగారు అలంకరణలు గల ధనస్సూ, బాణాలూ, కవచమూ ధరించాడు. విభీషణుడు కూడా మంచి విల్లు ధరించాడు. వాళ్ళు నికుంభిలకు వెళ్ళేటప్పుడు, దూరంగా వ్యూహం పన్ని ఉన్న రాక్షస సేన వారికి కంటపడింది.

విభీషణుడు లక్ష్మణుడికి ఆ రాక్షస సేనను చూపి, "ఇంద్రజిత్తు హోమం పూర్తి కాకముందే వానరసేనలు రాక్షస సేనలను నాశనం చెయ్యాలి. నువ్వు ఈ సేనను ఛేదించు. అప్పుడు నీకు ఇంద్రజిత్తు కనిపిస్తాడు. ఆ సమయంలో నువ్వు ఇంద్రజిత్తును చంపెయ్యి," అన్నాడు.

వెంటనే వానరులూ, భల్లూకాలూ, లక్ష్మణుడూ రాక్షససేన మీద దారుణమైన యుద్ధం చేశారు.

తన సేనలో చెలరేగిన హాహాకారాలు విని, ఇంద్రజిత్తు తన హోమం పూర్తి కాకుండానే లేచి, తన రథాన్ని ఎక్కి, యుద్ధానికి సిద్ధమై వచ్చాడు.

విభీషణుడూ, లక్ష్మణుడూ కొంత దూరం వెళ్ళాక ఒక మహావనం కనిపించింది. ఇంద్రజిత్తు హోమం చేసే చోటు అక్కడే ఉన్నది. అక్కడ నల్లగా, భయంకరమైన మహావృక్షం ఉన్నది. ఇంద్రజిత్తు అక్కడే భూత బలులు ఇచ్చి, యుద్ధానికి వస్తాడు. తరవాత అతను ఎవరికీ కనబడకుండా యుద్ధం చేస్తాడు.

ఈ సంగతి విభీషణుడు చెప్పేసరికి, లక్ష్మణుడు యుద్ధసన్నద్ధుడై ఆ మహావృక్షం సమీపంలో నిలబడ్డాడు. ఇంతలో యుద్ధానికి సిద్ధమై, రథం మీద ఇంద్రజిత్తు ఆ చెట్టును సమీపించాడు.

"నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాను. నాతో యుద్ధం చెయ్యి," అన్నాడు లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో.

ఇంద్రజిత్తు లక్ష్మణుడి మాట విని, అతని వెంట విభీషణుడు ఉండటం చూసి, ఆగ్రహంతో ఇలా అన్నాడు:

''విభీషణా, నువ్వు రాక్షసుడివై ఉండి కూడా కులాభిమానం ఎలా వదిలావు? ఇది నీ జన్మస్థలం. నువ్వు సాక్షాత్తూ నా తండ్రికి తమ్ముడివి. నాకు ఎలా ద్రోహం తలపెట్టావు? ధర్మం లేని దుర్మార్గుడివి. నీకు బంధువులనీ, స్నేహమనీ, కులమనీ, రక్తస్పర్శ అనీ లేదు. అయినవాళ్ళను వదిలిపెట్టి శత్రువుకు దాసుడివి అయ్యావు! బంధువులు నిన్ను చూసి ఏడుస్తారు; మంచివాళ్ళు నిన్ను తిట్టిపోస్తారు. అయినవాళ్ళ మధ్య గొప్పగా ఉండటానికీ, శత్రువులమధ్య హీనంగా ఉండటానికీ తేడా ఏమిటో నీకు తెలియలేదు. నాకు బంధువువై ఉండి, నా హోమం భగ్నంచేసి, నాకు అపకారం చెయ్యటానికి ఇలా చేశావు. ఇలాటి నీచమైనపని మరొకడు చెయ్యడు."

దానికి విభీషణుడు ఇలా అన్నాడు:

''నా స్వభావం నీకు తెలీదా? నాది సాత్విక స్వభావం. అధర్మాన్ని నేను సహించలేను. లేకపోతే, నా అన్నను నేను వదులుకుంటానా? నీ తండ్రికి అన్ని అవలక్షణాలూ ఉన్నాయి. త్వరలోనే ఈలంకలోని రాక్షసులు, నీతండ్రితో సహా నశించనున్నారు. నీకు చావు మూడింది. నన్ను ఏమనాలని ఉన్నదో అన్నీ అను. చచ్చిపోనున్నవాడివి నిన్ను





తిట్టి ఏం లాభం? మాయాసీతను చంపి, రామలక్ష్మణులకు అవమానం చేశావు. నువ్వు జీవించలేవు. లక్ష్మణుడితో యుద్ధం చేసి, చచ్చిపోయి, యమదూతలకు సేవ చెయ్యి.''

ఇంద్రజిత్తు లక్ష్మణుణ్ణి చూసి, ''ఆ రాత్రి యుద్ధంలో నా బాణాలదెబ్బ తెలుసుకుని కూడా నువ్వు మళ్ళీ నాతో యుద్ధానికి వచ్చావంటే నీకు మతిమరుపో, ఆయువు తీరిపోవటమో కావాలి,'' అన్నాడు.

''దొంగలాగా కనబడకుండా యుద్ధం చేసి గొప్ప వీరుణ్ణి అనుకుంటున్నావు! ఇప్పుడు చూపించు నీ అసలు ప్రతాపం,'' అన్నాడు లక్ష్మణుడు.

ఇంద్రజిత్తు చప్పున లక్ష్మణుడి మీద బాణాలు వేసి, అతని శరీరమంతా నెత్తురుమయం చేశాడు. లక్ష్మణుడు కోపించి, ఇంద్రజిత్తు మీద తీవ్రమైన బాణాలు వేశాడు. ఇద్దరూ సమానంగా యుద్ధం చేశారు.

కొంతసేపు యుద్ధం సాగాక ఇంద్రజిత్తు ముఖంలో విభీషణుడికి భయం కనిపించింది. అతను లక్ష్మణుడితో, "ఇంద్రజిత్తు దెబ్బ తిన్నట్టున్నాడు. అతన్ని చంపెయ్యటానికి ఇదే సమయం,'' అన్నాడు.

లక్ష్మణుడు మరింత తీక్ష్ణమైన బాణాలతో ఇంద్రజిత్తును కొట్టాడు. ఇంద్రజిత్తు మూర్ఛపోయాడు.

అయితే, ఇంద్రజిత్తు స్పృహవస్తూనే ఎదురుగా లక్ష్మణుణ్ణి చూసి, తన పరాక్రమం మాట జ్ఞాపకం వచ్చి, లక్ష్మణుడి మీదా, అంతకన్నా హెచ్చుగా విభీషణుడి మీదా బాణాలు వేశాడు.

ఆ బాణాలు లక్ష్మణుడికి కొంచెమైనా బాధ కలిగించలేదు. ''యుద్ధంలో గెలవగోరినవాడు ఇలాగా బాణాలు వేసేది?'' అంటూ అతను ఇంద్రజిత్తు మీద తీవ్రమైన బాణాలు వేశాడు.

లక్ష్మణుడి బాణాలకు ఇంద్రజిత్తు కవచం ముక్కలు ముక్కలుగా రథంలో



రాలిపడింది. అతని దేహం బాగా గాయపడింది.

ఇంద్రజిత్తు ఆగ్రహించి, తన బాణాలతో లక్ష్మణుడి కవచాన్ని కూడా పగలగొట్టేశాడు. ఈ విధంగా వారిద్దరూ ఒకరికొకరు తీసిపోకుండా చాలాసేపు యుద్ధం చేశారు. ఇద్దరూ జయమేకోరి పట్టుదలతో పోరాడారు. అలాటి యుద్ధం ఎవరో ఒకరు చచ్చినదాకా ఆగదు.

ఆ యుద్ధం చూసిన మీదట విభీషణుడు తాను కూడా తన మంత్రులు నలుగురితోసహా యుద్ధానికి పూనుకోవటం మంచిదని భావించి వానర సైనికులతో ఇలా అన్నాడు:

"వానర వీరులారా, ఇక రావణుడికి ఈ ఇంద్రజిత్తు తప్ప వేరేగతిలేదు. వీణ్ణి ఎందుకు ఉపేక్షిస్తారు? మీరు ఇప్పటికి రాక్షస వీరుల నందరినీ చంపేశారు. ఈ ఒక్క ఇంద్రజిత్తు అనగా ఎంత? వీణ్ణి కూడా చంపేశారంటే రావణుడు దిక్కులేని వాడే! వాణ్ణి నేనే చంపుదును గాని, వాడు నాకు కొడుకు వరస. నేను వాణ్ణి చంపటం తప్పు అవుతుంది. ఇంద్రజిత్తుకు సహాయంగా ఉన్న సేనను నిర్మూలించండి."

ఈ మాటలు విని వానరులు తోకలాడించి, సింహనాదాలు చేసి, రాక్షససేన మీదికి విజృంభించారు. విభీషణుడూ, అతని మంత్రులూ కూడా రాక్షససేనపై యుద్ధం సాగించారు.

ఈలోపుగా లక్ష్మణుడు ఒక బాణంతో ఇంద్రజిత్తు రథసారధి తల నరికేశాడు. అప్పుడు ఇంద్రజిత్తు తానే తన రథాన్ని నడుపుకుంటూ యుద్ధం చేశాడు. అది చూడటానికి ఆశ్చర్యకరంగానే ఉన్నది గాని, లక్ష్మణుడు అతన్ని బాధించటానికి అవకాశం మరింతగా ఏర్పడింది. ఆ దెబ్బతో ఇంద్రజిత్తుకు ఉండిన యుద్ధగర్వం పోయింది. అతని ముఖంలో మార్పు గమనించిన వానరులు ఎంతగానో సంతోషించారు.

ప్రమాథీ, శరభుడూ, రభసుడూ, గంధమాదనుడూ అనే నలుగురు వానర వీరులూ, ఇంద్రజిత్తు రథాన్ని లాగే నాలుగు గుర్రాల మీదా ఒక్కసారి పడ్డారు. అవి నెత్తురు గక్కి, చచ్చి పడిపోయాయి.

ఇంద్రజిత్తు రథం నుంచి నేల మీదికి దిగి, లక్ష్మణుడిపై బాణాలు వేస్తూ మీదికి వచ్చాడు. అతని చుట్టూ రాక్షసులు కమ్ముకుని ఉన్నారు.

ఇంద్రజిత్తు వాళ్ళతో, "మీరు యుద్ధం సాగిస్తూ ఉండండి. మీ చాటున నేను నగరంలోకి వెళ్ళి, మరొక రథం ఎక్కి వస్తాను," అన్నాడు.

అతను ఆ ప్రకారమే లంకలోకి వెళ్ళి, మంచి రథం సిద్ధం చేయించి, దానిమీద తిరిగి యుద్ధానికి వచ్చాడు. అతను ఉన్నట్టుండి రథం మీద తిరిగి ప్రత్యక్షం కావటంచూసి, లక్ష్మణుడూ, విభీషణుడూ కూడా ఆశ్చర్యపోయారు.

ఈసారి ఇంద్రజిత్తు తన బాణాలతో వానరసేనకు అమితంగా నష్టం కలిగించాడు. అదిచూసి లక్ష్మణుడు అతని విల్లు విరిచాడు. తరవాత అతని సారథి తల నరికేశాడు. అయినా ఇంద్రజిత్తు యుద్ధం సాగించటమేగాక, విభీషణుణ్ణి కూడా తన బాణాలతో గాయపరిచాడు. విభీషణుడు



మండిపడి, తన గదతో ఇంద్రజిత్తు రథాశ్వాలను చంపాడు.

తరవాత ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ దివ్యాస్త్రాలు ఒకరి మీద ఒకరు ప్రయోగించుకున్నారు. చిట్టచివరకు లక్ష్మణుడు ప్రయోగించిన ఇంద్రాస్త్రంతో ఇంద్రజిత్తు తల తెగి కిందపడింది.

విభీషణుడూ, వానరులూ సింహనాదాలు చేశారు. వానరులు విజయగర్వంతో తమని వధ చెయ్యసాగేసరికి రాక్షసులు రెట్టింపు శోకంతో లంకలోకి పారిపోయారు.

ఇంద్రజిత్తు చావగానే వానరులు అమితంగా సంతోషించి, లక్ష్మణుణ్ణి కొని

యాడారు. లక్ష్మణుడు రాముడి వద్దకు పోయి నమస్కరించి నిలబడ్డాడు. రాముడు అతన్ని కౌగలించుకుని, "ఇంద్రజిత్తు చావటం రావణుడి కుడిభుజం తెగి పోవటమే. ఇక రావణుణ్ణి అతి సులువుగా చంపగలను," అని, లక్ష్మణుడి గాయాలకు చికిత్స చేయమని సుషేణుణ్ణి నియోగించాడు.

ఇంద్రజిత్తు వెంట వచ్చి, యుద్ధభూమిలో అక్కడక్కడా యుద్ధం చేస్తున్న రాక్షసవీరులు, ఇంద్రజిత్తు పోయినట్టు విని దుఃఖిస్తూ, రావణుడి వద్దకు వెళ్ళి, విభీషణుడి సహాయంతో లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపాడని చెప్పారు. ఆ వార్త వింటూనే రావణుడు మూర్ఛపోయాడు.

తిరిగి స్పృహ వచ్చినాక రావణుడు ఇంద్రజిత్తు కోసం చాలా శోకించాడు. అతని పుత్రశోకం క్రమంగా క్రోధంగా మారింది. అతనికి సీతనే చంపెయ్యాలన్న అభిప్రాయం కలిగింది. అతను తన ఎదట ఉన్న రాక్షసులతో, "నా కొడుకు ఇంద్రజిత్తు మాయసీతను వానరుల ఎదట చంపి చూపించాడు. నేను నిజమైన సీతనే చంపుతాను. రాముడి మీది నుంచి మనసు మరలని సీతను చంపేస్తాను," అని చెప్పి, కత్తి దూసి, రౌద్రంగా అశోకవనంలో ఉండే సీతాదేవి దగ్గరికి బయలుదేరాడు.

ఈ సంగతి తెలిసి మండోదరీ, రావణుడి మంత్రులూ అతనికి అడ్డు తగిలారు.

"ఇప్పటికైనా సీతను రాముడికి అప్పగించి, సర్వనాశనం జరగకుండా చూడు," అని మండోదరి రావణుడికి హితవు చెప్పింది.

"ఈ కోపాన్ని రాముడి మీద చూపించు. సీతను చంపి సాధించేదేమిటి?" అన్నారు రావణుడి మంత్రులు.

తన కర్తవ్యం రాముణ్ణి చంపటమే కాని, సీతను చంపటం కాదని తెలుసుకుని, రావణుడు ఉగ్రమైన లంకా యాగం మొదలు పెట్టాడు.



# చందమామ కబుర్లు

## కృత్రిమ వర్షం!

గుజరాత్‌లోని కచ్ ప్రాంతంలో గత జూలై నెలలో కొన్ని ప్రయోగాలద్వారా వర్షం కురిపించారు. 'కాలే బొగ్గు'మీద 'సిల్వర్ అయోడైడ్' అనే రసాయనిక పదార్థాన్ని చల్లినట్టయితే ఆ ఆవిరి మేఘాలను తాకి వర్షం కురుస్తుంది. దీనిని 'క్లౌడ్‌సీడింగ్' అని అంటారు. అయితే దీనికి, అనుకూలమైన వాతావరణం అంటే — ఆకాశంలో మేఘాలు, సరైన ఉష్ణోగ్రత, గాలిలో తగిన తడి కావాలి. అప్పుడే ఈ ప్రయోగం విజయవంతమవుతుంది. 27 చోట్ల జరిగిన 'క్లౌడ్‌సీడింగ్' ప్రభావం వాతావరణం మీద నాలుగు రోజులు కొనసాగింది.



## ఈదడంలో రికార్డు!



అంధుల పర్వతారోహణ గురించి ఇటీవల తెలుసుకున్నాం. ఇప్పుడు ఒక వికలాంగురాలు ఈతలో సరికొత్త రికార్డు సృష్టించింది. బెంగుళూరుకు చెందిన జానకి అనే స్త్రీకి పక్షవాతంతో రెండు కాళ్ళూ దెబ్బ తిన్నాయి. బ్యాంక్ ఉద్యోగిని అయిన ఆమె చక్రాల కుర్చీలోనే తిరుగుతుంది. అచంచలమైన పట్టుదలతో ఆమె కల్లోలితమైన 'ఇంగ్లీష్ ఛానల్'లో ఇంగ్లాండులోని షేక్స్‌పియర్ బీచ్‌నుంచి, ఫ్రాన్స్‌లోని విస్సంట్ వరకు అంటే 37 కి.మీ. దూరం ఈది రికార్డును సృష్టించింది. ఆమె బెంగుళూరులోనే ఈతలో శిక్షణ ప్రారంభించింది. సముద్రం ఈతలో శిక్షణ పొందడానికి మాల్పే బీచ్‌కి వెళ్ళింది. అక్కడ చేరిన ఒక వారంలోగా 7 కి.మీ. దూరంలోవున్న సెయింట్ మేరీస్ దీవిని చేరుకోకలిగింది. మాల్పే శీతోష్ణస్థితి అలవాటు పడటానికి ఐదు వారాలు గడిపాక, మూడు వారాలు శిక్షణపొంది, జానకి జూలై 29 వ తేదీ 37 కి.మీ. దూరం ఈదగలిగింది. నీళ్ళలోంచి గట్టుమీదికి వస్తూ ఆమె, 'నా జీవిత స్వప్నం ఫలించింది' అని అన్నది.

## అదుపులోకి వచ్చిన పెరుగుదల!



కరీంనగర్ జిల్లాకు చెందిన గట్టయ్య అనే కుర్రవాడు పదకొండేళ్ళ వయసు వరకూ మామూలుగా, అంటే 4 అడుగుల ఎత్తే ఉండేవాడు. ఆ తరవాత అతడు వెదురు చెట్టులా పెరగసాగాడు. పద్దెనిమిదేళ్ళు వచ్చేసరికి 7 అడుగులా 4 అంగుళాల ఎత్తు పెరిగాడు. ఇప్పుడు మనదేశంలో అందరికన్నా పొడవైనవాడు గట్టయ్య. అయినా, అతడు పెరగటం ఆగలేదు. అసాధారణమైన గట్టయ్య పెరుగుదలకు కారణం ఏమిటాఅని డాక్టర్లు పరిశోధనలు జరిపారు. పిట్యూటరీగ్రంధిలో ఏర్పడిన 'ట్యూమర్' కారణమని గ్రహించి, ఇద్దరు డాక్టర్ల పర్యవేక్షణలో 12 మంది డాక్టర్లు, 5 గంటలసేపు ఆపరేషన్ చేసి, 'ట్యూమర్'ను తొలగించారు. అప్పటికి ఆగింది గట్టయ్య పెరుగుదల!




చిన్నాపురం అనే ఊళ్ళో సాంబయ్య, లింగయ్య అనే ఇద్దరు వ్యాపారస్థులుండే వారు. వాళ్ళు ఇరుగుపొరుగు వాళ్ళు కావడంతో, ఇద్దరి మధ్యా అంతో ఇంతో స్నేహం వుండేది. సాంబయ్య మనసు మంచిది. పరోపకారి, పాపభీతి కలవాడు. కానీ లింగయ్య మాత్రం పెద్ద కపటి. కాస్త పచ్చగా వుండేవాళ్ళను చూసి ఈర్ష్యతో కుమిలిపోయేవాడు.

సాంబయ్య మంచితనం అదీ తెలిసిన ఆ ఊరివాళ్ళు, అతనిపట్ల ఎంతో అభిమానం కనబరిచేవాళ్ళు. ఇది లింగయ్యకు నచ్చేది కాదు. క్రమంగా అతనిలో ఈర్ష్యాభావం పెరిగిపోయి, సాంబయ్య పట్ల ద్వేషంగా మారింది. ఎలాగైనా అతణ్ణి చిక్కులపాలు చెయ్యాలని నిర్ణయించుకుని, సమయం కోసం ఎదురు చూడసాగాడు.

ఇలా వుండగా, పెళ్ళీడు కొచ్చిన సాంబయ్య కూతురికి సంబంధం కుదిరింది. పెళ్ళి ఖర్చులకు డబ్బు తక్కువ కావడంతో, అతడు లింగయ్యను కొంత డబ్బు సర్దమని అడిగాడు.

ఇది లింగయ్యకు మంచి అవకాశంగా తోచింది. అయితే, ఆ అవకాశాన్ని సాంబయ్యను చిక్కుల్లో పెట్టడానికి ఎలా ఉపయోగించుకోవాలా అని ఆలోచిస్తూ, "నా దగ్గిర మాత్రం డబ్బెక్కడుంది, సాంబయ్యా! ఈమధ్యనేకదా, నా నాలుగో కూతురి పెళ్ళి పెద్దకట్నం పోసి అయిందనిపించాను. మరెక్కడైనా ప్రయత్నించు," అన్నాడు.

సాంబయ్య స్వతహాగా మొహమాటస్థుడు. అతడు ఎవరి దగ్గిరకూ వెళ్ళి అప్పు అడగలేడని లింగయ్యకు తెలుసు. అందుకే, ఈ చిన్నఅడ్డుపుల్ల వేసిచూశాడు.

రావినూతల సువర్ణాకన్నన్

లింగయ్య ఊహించినట్టే సాంబయ్య, ''నాసంగతి నీకు తెలియంది కాదుకదా, లింగయ్యా! పనిగట్టుకుని వెళ్ళి డబ్బు కోసం ఎవరి దగ్గిర చెయ్యిచాపగలను. ఈ సాయమేదో నువ్వే చెయ్యాలి. నా చర్మం ఒలిచి నీకు చెప్పులు కుట్టిస్తాను!'' అంటూ లింగయ్య చేతులు పట్టుకుని ప్రాధేయ పడ్డాడు.



లింగయ్య కాసేపు ఆలోచించినట్టు నటించి, ''సరే, తప్పేదేముంది! ఆ మధ్య మా వియ్యంకుడి మేనమామ వెంకటా చలం దాచమని, నాకు కొంత డబ్బిచ్చి పోయాడు. దాచమంటే, అతడి ఉద్దేశం దాన్ని వడ్డీలకు తిప్పమనే. అందులోంచి నీక్కావలసిన మొత్తం ఇస్తాను,'' అంటూ లోపలి గదిలోకి పోయి డబ్బు తెచ్చి, సాంబయ్యకిచ్చాడు.

సాంబయ్య తన కూతురు పెళ్ళయిన నాలుగు నెలలకల్లా, లింగయ్య ఇచ్చిన డబ్బు వడ్డీతోసహా తీసుకువచ్చి చెల్లించి, ''ఆనాడు నువ్వు చేసింది చాలా గొప్ప సాయం, లింగయ్యా!'' అన్నాడు కృతజ్ఞతగా.

లింగయ్య ఒకక్షణకాలం ఆశ్చర్య పోతున్నవాడిలా సాంబయ్యకేసి చూసి, ''అది సరే! మరి చెప్పులజత మాటే మిటి?'' అన్నాడు నిలదీసినట్టు.

''చెప్పుల జతేమిటి?'' అన్నాడు సాంబయ్య, లింగయ్య అన్నదేమిటో అర్థంకాక.

''ఆహాఁ, ఇదీ ఈ కలియుగంలో మనుషుల తీరు! అవసరంతీరాక ఎవరైనా సరే మాట్లాడే మాటతీరు ఇలాగే వుంటుంది. నా దగ్గిర డబ్బు తీసుకునే టప్పుడు, నీ చర్మంతో నాకు చెప్పులు కుట్టిస్తానన్నావుగదా? ఇంతలోనే అన్న మాట మరిచావా?'' అని అన్నాడు లింగయ్య నిష్ఠూరంగా.

సాంబయ్య నిర్ఘాంతపోయి, ''ఏదో మాటవరసకన్నమాట! నువ్వు దాన్ని నిజం అనుకోవడం ఏమిటి?'' అన్నాడు.

లింగయ్య కోపంగా, "అదంతా నాకు తెలియదు. మాటంటే మాటే!" అన్నాడు వీధంతా మారుమోగిపోయేటట్టు.

నలుగురూ చేరారు. విషయం విని లింగయ్యకు నచ్చజెప్ప చూశారు. అయితే, లింగయ్య ససేమిరా తనకు సాంబయ్య చర్మపు చెప్పులు కుట్టించి తీరాలని పట్టు పట్టాడు.

ఈ సంగతి గ్రామాధికారిదాకా వెళ్ళింది. లింగయ్య దగ్గిర లంచం తిన్న గ్రామాధికారి, లింగయ్యకు అనుకూలంగా తీర్పుచెప్పాడు. దిక్కుతోచని సాంబయ్య, కూతురు, అల్లుడు ఇచ్చిన సలహామేరకు అప్పటికప్పుడే బయలుదేరి రాజుగారి దగ్గిరకు వెళ్ళాడు.

రాజు, లింగయ్యను కూడా పిలిపించి, కథంతా విని, తీర్పుకోసం వారం రోజుల తరవాత రమ్మని ఇద్దరినీ పంపేశాడు.

రెండు రోజుల తరవాత లింగయ్య, ఏదో సొంతపని మీద పట్నం బయలు దేరాడు. దారిలో ఒక అడవి ప్రాంతాన దొంగలు హఠాత్తుగా అతడి మీద దాడి చేశారు. అయితే, అదే సమయానికి రాజు గుర్రం మీద వేటకు పోతూ, దూరం నుంచి వాళ్ళను చూశాడు.

రాజును గుర్తుపట్టిన లింగయ్య, చేతు లెత్తి ఆయనకు నమస్కరిస్తూ, "మహా ప్రభో! ఈ దొంగల బారినుంచి నన్ను రక్షించండి. చచ్చి మీ కడుపున పుడతాను!" అని వేడుకున్నాడు.



రాజు కత్తిదూసి దొంగలను తరిమి కొట్టాడు. లింగయ్య ఆనందంగా ఆయనకు వంగి వంగి దణ్ణం పెట్టి, తన కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

గడువురోజున సాంబయ్య, లింగయ్య రాజు దగ్గిరకు వెళ్ళారు. రాజు మరొక సారి వాళ్ళు చెప్పింది విని, "మాటంటే మాటే! సాంబయ్య అన్నమాట ప్రకారం, లింగయ్యను తన చర్మం ఒలిచి చెప్పులు కుట్టించాల్సిందే," అని తీర్పు చెప్పాడు.

సాంబయ్య భయంతో వణికిపోయాడు. సభలో వున్న వాళ్ళందరూ నిర్ఘాంత పోయారు. మొదట ఇలాంటితీర్పే ఇచ్చిన గ్రామాధికారీ, లింగయ్య మాత్రం పొంగి పోయారు.

లింగయ్య కసిగా పళ్ళు కొరుకుతూ, సాంబయ్యను సమీపిస్తుండగా, రాజు, "ఆగు!" అన్నాడు. లింగయ్య ఆగాడు. రాజు తాపీగా, "సాంబయ్య నీకిచ్చిన మాట సరే. నువ్వు, నాకిచ్చిన మాట సంగతేమిటి?" అని అడిగాడు.

"ఏ మాట, ప్రభూ!" అన్నాడు లింగయ్య అమాయకంగా.

"ఆహాఁ, అప్పుడే ఇచ్చినమాట మరిచా వన్నమాట! నాలుగు రోజుల క్రితం నువ్వన్నదేమిటి? దొంగలబారి నుంచి రక్షిస్తే, నా కడుపున పుడతాననేగదా! ఇప్పుడు నువ్వు చనిపోతే, త్వరలో నాకు వారసుడు పుడతాడు!" అన్నాడు రాజు గంభీరంగా.



ఇదివిని లింగయ్య నిలువెల్లా కంపించిపోతూ, "ఏదో మాటవరసకన్నాను, ప్రభూ!" అన్నాడు.

"అదేం కుదరదు. మాటంటే మాటే! సాంబయ్య మాటవరసకన్నమాట మీదే కదా, మీ ఊరినుంచి నాదాకా వచ్చారు. ఇప్పుడు నీ విషయంలో తీర్పు మరోలా ఇస్తే, ప్రజలేమనుకుంటారు? అందువల్ల, నువ్వు సాంబయ్య చర్మం ఒలిచిన మరుక్షణం చావడానికి సిద్ధంగా వుండు. సాంబయ్య చర్మపు చెప్పుల జత, నా కడుపునపుట్టాక తొడుక్కుందువుగానిలే!" అన్నాడు రాజు.

సభలో అందరూ పెద్దగా నవ్వారు.

లింగయ్య సిగ్గుతో తలవంచుకున్నాడు. రాజు తనకు బుద్ధి చెప్పడానికే, దొంగల్ని సృష్టించి, తనకలవాటైన ఊతపదాన్ని ఇలా ఉపయోగించుకున్నాడని, అతడికి అర్థమైంది.

లింగయ్య చప్పునపోయి, రాజుపాదాల మీదపడి, "మహాప్రభో! ఇక జన్మలో ఎలాంటి తప్పూ చెయ్యను. ఇది మొదటి తప్పుగా భావించి మన్నించండి," అంటూ వేడుకున్నాడు.

"సరే! ఇది మొదటి తప్పుగా భావించి వదిలేస్తున్నాను. ముందు సాంబయ్యకు క్షమాపణ చెప్పుకో," అన్నాడు రాజు.

లింగయ్య, సాంబయ్య చేతులు పట్టుకుని క్షమించమని కోరాడు. మంచి మనసూ, క్షమాగుణం గల సాంబయ్య అతణ్ణి తేలిగ్గా క్షమించేశాడు.

రాజు, లంచం తిన్న గ్రామాధికారికి స్వల్పశిక్ష వేసి, గట్టిగా హెచ్చరించాడు. రాజు ఈ వివాదాన్ని పరిష్కరించిన తీరు చూసి, అందరూ హర్షధ్వానాలు చేశారు. సాంబయ్య, లింగయ్య తలవంచి రాజుకు నమస్కరించి తమఊరు బయలుదేరారు.

ఆనాటి నుంచీ వాళ్ళిద్దరూ నిజమైన స్నేహితులుగా మారిపోయారు. లింగయ్య తన కపటప్రవర్తనకు స్వస్తి చెప్పి, నిజాయితీగా మసులుతూ అందరిచేతా మంచివాడనిపించుకున్నాడు.



# ఆవు మంచితనం

ఒక జమీందారుకు పాడిఆవుల మీద ఎక్కువ మక్కువగా వుండేది. పశువుల సంతలు జరిగే రోజుల్లో, ఆయన తప్పకుండా తన పనివాళ్ళతో అక్కడికి వెళ్ళి, నచ్చిన పాడిఆవులను బేరమాడి కొనేవాడు.

ఒకసారి పశువుల సంతలో జమీందారుకు ఏ ఆవూ నచ్చలేదు. ఇంతలో ఒక రైతు తన పాడి అవును అమ్మాలని, అవును, దూడను తోలుకుని సంతలోకి వస్తూ కనిపించాడు.

ఆవు చూడటానికి బాగా ఉండడంచేత, జమీందారు రైతును ఆపి, "ఆవును అమ్ముతావా?" అని అడిగాడు.

"అమ్మటానికే కదండీ, ఇంత దూరం తోలుకు వచ్చింది," అన్నాడు రైతు అమాయకంగా.

"ఆవు మంచిదేనా?" అని అడిగాడు జమీందారు.

"నా ఆవు నాకు మంచిదిగాక చెడ్డదిగా ఎలా కనిపిస్తుంది, బాబయ్యా!" అన్నాడు రైతు.

"అదేమన్నా పొడిచే లక్షణం వున్నది కాదు కదా?" అని ప్రశ్నించాడు జమీందారు.

"కోపం తెప్పిస్తే పొడవకేం చేస్తుందండీ! మనిషయితే కసురుతాడు; పశువైతే పొడుస్తుంది. ఇది మామూలే కదండీ," అన్నాడు రైతు.

"సరేలే! ఇంతకూ నీ ఆవు రోజుకు ఎన్ని సేర్ల పాలిస్తుంది?" అని అడిగాడు జమీందారు.

"అది తేల్చి చెప్పడం కష్టం, బాబయ్యా! కాని ఒకటి, నా ఆవు తనదగ్గిరున్న పాలన్నీ దాచుకోకుండా ఇచ్చేస్తుంది," అన్నాడు రైతు.

ఆ జవాబుకు జమీందారు చిన్నగా నవ్వుకుని, మరేమీ ప్రశ్నించకుండా, రైతు అడిగిన ధరకు ఐదు వరహాలు అధికంగానే ఇచ్చి, ఆవును కొన్నాడు. —యస్. లక్ష్మివిద్య





# దైవభీతి – రాజభక్తి

ఇరాన్‌దేశంలోని ఒక గ్రామంలో ఇబ్రహీం, ఇస్మాయీల్ అనే ఇద్దరు కట్టెలు అమ్ముకునేవారు ఉండేవారు. వాళ్ళు రోజూ అడవికి పోయి, కట్టెలు కొట్టి, సమీపంలో ఉన్న నగరానికి పోయి అమ్ముకుని, ఆ చాలీచాలని డబ్బుతో తమ పెద్ద సంసారాలు గడుపుతూ, తాము ఏ విధంగానైనా ధనవంతులమై పోతే బాగుండుననుకునేవారు.

అయితే, ఇబ్రహీం దైవభీతి, రాజభక్తి కలవాడు కావటంచేత, దైవానికీ, రాజుకూ సమ్మతమయ్యేలాగా తాను ధనవంతుడు కావాలని కోరుకునేవాడు. ఇస్మాయీల్‌కు ఇలా పట్టింపు లేదు. దైవంగాని, రాజుగాని తన దారిద్ర్యాన్ని తొలగించరు గనక, తాను ధనవంతుడు కావడానికి వారి సమ్మతి అవసరం లేదని అతని ఉద్దేశం.

ఒకరోజు అడవిలో వాళ్ళిద్దరూ చెరొకపక్కా కట్టెలు కొట్టుతున్నారు. ఉన్నట్టుండి ఇస్మాయీల్‌కు ఒక ఆలోచన వచ్చింది. అతను ఇబ్రహీం దగ్గరకు వచ్చి, "చూడు, ఇబ్రహీం! అడవులలో నిధి నిక్షేపాలుంటాయంటారు. మనకు అటువంటిది ఒకటి దొరికిపోతే ఎంత బాగుంటుంది!" అన్నాడు.

"దొరికితే ఏం లాభం? అది మనకు చెందదు కదా! నిధి నిక్షేపాలు ప్రజలందరి సొత్తూ కనక, అవి పాదుషాకు చెందటం సంప్రదాయం," అన్నాడు ఇబ్రహీం.

"నీ సంప్రదాయం తగ్గలబడా!" అని శాపనార్థాలు పెట్టి, ఇస్మాయీల్ తన పని చూసుకోబోయాడు.

మర్నాడు ఇద్దరూ అడవిలో కట్టెలు కొట్టేటప్పుడు ఇబ్రహీంకు ఒక మొద్దు

ఇరాన్ జానపద కథ

దొరికింది. అతను దాన్ని కష్టపడి రెండుగా గొడ్డలితో నరికేసరికి అతనికి ఆశ్చర్యమూ, భయమూ కూడా కలిగాయి. ఎందుకంటే ఆ మొద్దు లోపల ఒక బంగారు పాత్ర ఉన్నది. మూత తీసి చూస్తే పాత్రనిండా బంగారు దీనారాలున్నాయి.



అతను వెంటనే ఇస్మాయిల్ ఉన్న చోటికి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. ఇబ్రహీంను చూసి ఇస్మాయిల్ కంగారుపడ్డట్టు కనిపించాడు. కాని, తనకు బంగారం దొరికిందని ఇబ్రహీం చెప్పినాక ఆశ్చర్యపడి, "దాన్ని ఏం చెయ్యబోతున్నావు?" అని అడిగాడు.

"ఏముందీ? తీసుకుపోయి పాదుషా గారికి ఇచ్చేస్తాను. ఆయన ఏమైనా ఇస్తే తీసుకుంటాను," అన్నాడు ఇబ్రహీం.

"ఓరి దౌర్భాగ్యుడా! అయితే నీకు మంచికాలం రాదుపో," అన్నాడు ఇస్మాయిల్.

"మంచికాలం వచ్చేమాటుంటే నన్ను వెతుక్కుంటూ అదే వస్తుంది," అన్నాడు ఇబ్రహీం.

డబ్బు కోసం అంతగా విలవిలలాడే ఇస్మాయిల్ తనకు దొరికిన బంగారాన్ని చూడటానికైనా రాకపోవటం ఇబ్రహీంకు ఆశ్చర్యంగానే తోచింది. అతను బిందెను తీసి ఒక పక్కన పెట్టి, మొద్దును నరికి కట్టెలుచేసి, బంగారు పాత్రను కట్టెల మధ్య కనబడకుండా పెట్టి మోపుకట్టి, ఇంటికి వెళ్ళి కట్టెలు అక్కడ పడేసి, బంగారు పాత్రను రాజధానికి తీసుకుపోయి పాదుషా పాదాల దగ్గిర పెట్టి అది తనకు ఎలా దొరికినదీ చెప్పుకున్నాడు.

పాదుషా నిండు దర్బారులో అతని రాజభక్తిని మెచ్చుకుని, ఆ పాత్రను స్వీకరించి, ఇబ్రహీంకు బహుమానంగా పాత్రలోని దీనారాలియ్యక, ఖజానా నుంచి నూరు దీనారాలు తెప్పించి ఇచ్చి, అతన్ని పంపేశాడు.

ఇబ్రహీం వెంటనే ఆ డబ్బుతో చిన్న వ్యాపారం ప్రారంభించాడు.

ఇది జరిగిన రెండు రోజుల తరవాత, ఇస్మాయీల్ నకిలీ బంగారాన్ని మేలిమి బంగారమని చెప్పి, రాజధాని నగరంలో అమ్మజూపుతూ రాజభటులకు దొరికి పోయాడన్న వార్త ఇబ్రహీం ఉండే గ్రామంలో తెలిసింది. ఇబ్రహీం వెంటనే రాజధానికి వెళ్ళాడు.

ఇస్మాయీల్ పాదుషాగారి విచారణ ఎదురుచూస్తూ నిర్బంధంలో ఉన్నాడు. ఇబ్రహీం పాదుషాను కలుసుకుని, ఇస్మాయీల్‌కు తాను జామీను ఉంటాననీ, అతన్ని వదిలిపెట్టవలసిందనీ కోరాడు. పాదుషా ఇబ్రహీం అభ్యర్థన విని, సభికులతో ఇలా చెప్పాడు:

"దైవభీతి, రాజభక్తి కలిగి సంప్రదాయ బద్ధంగా జీవించేవారు సుఖంగా ఉండగలరు. వీటిని వ్యతిరేకించిన వారు కష్టాలపాలవుతారు. ఇందుకు ఒక చిన్న కథ చెబుతాను. ఇద్దరు కట్టెలమ్మి జీవించేవారుండేవారు. వారిలో ఒకడు దైవభీతి, రాజభక్తి కలవాడు. ఒకరోజు షికారుగా అడవికి పోయిన పాదుషా వారి సంభాషణ విని, రెండు నకిలీ బంగారపు పాత్రలను వారు కట్టెలు కొట్టే చోట పూడ్పించాడు. అవి వారిద్దరికీ దొరికాయి. మొదటివాడు తన బంగారపు పాత్రను సంప్రదాయం ప్రకారం పాదుషాకు అప్పగించి, నూరు దీనారాలు బహుమతి పొందాడు. రెండోవాడు అంతా తనకే కావాలని దురాశపడి, సంప్రదాయ విరుద్ధంగా ఆ నకిలీ బంగారాన్ని అమ్మబోయి దొరికిపోయాడు. మొదటివాడు ఇబ్రహీం, రెండోవాడు ఇస్మాయీల్."

ఇలా చెప్పి పాదుషా ఆ ఇద్దరినీ సభికులకు చూపాడు.

ఇబ్రహీం జామీను పైనా, అతని కోరిక ప్రకారమూ ఇస్మాయీల్‌ను పాదుషా వదిలిపెట్టాడు. ఇస్మాయీల్‌కు బుద్ధి వచ్చి, చెంపలు వేసుకున్నాడు. ఇబ్రహీం అతన్ని తన వ్యాపారంలో భాగస్వామిగా చేసుకున్నాడు. కాలక్రమాన ఇద్దరూ పెద్ద వ్యాపారస్తులయ్యారు.



# ప్రకృతి వింతలు :

## కోతుల పరిశుభ్రత!

మనుషులలాగే కోతులు తమ శరీరాలను గీరుకోవడం అందరికీ తెలిసినదే. కోతులు తమ శరీరాలను శుభ్రంగా ఉంచుకుంటాయి. ఒక కోతి మరొక కోతి శరీరాన్ని ఆకులతో తుడవడం తరచూ జరుగుతూ ఉంటుంది. ఒక్కొక్కసారి చిన్న పుల్లతో, ఒకకోతి మరొకకోతి పళ్ళను శుభ్రం చేస్తుంది!



## తూనీగ వీరవిహారం!

లార్వాదశలోని తూనీగలను జలకన్య (నింఫ్) లని అంటారు. ఇవి విపరీతమైన ఆకలితో నీళ్ళలోని చిన్నచిన్న చేపలనూ, క్రిములనూ, నత్తలనూ, కప్పపిల్లలనూ పట్టి తింటాయి. ఏవీ లేనప్పుడు సాటి లార్వాలనే పట్టి తింటూ, నీళ్ళలో ఒక భయాన్ని పుట్టిస్తాయి. అలా నీళ్ళలో చాలాకాలం గడిపి, రూపాంతరం కలిగే దశ సమీపించగానే వెలుపలికి వస్తాయి. పైచర్మాన్ని ఒలుచుకుని అందమైన రెక్కలతో బయట ప్రపంచంలోని కీటకాలను పట్టి తినడానికి బయలుదేరుతాయి!



## గురితప్పని చేపలు!

'ఆర్చర్' చేపలు దాదాపు 20 సెం. మీ. పొడవు ఉంటాయి. తెల్లగా మెరిసే వీటి శరీరం మీద అడ్డంగా నల్లటి చారలుంటాయి. ఇవి ఆహారం వేటాడే తీరు చాలా విచిత్రమైనది. పెద్ద కళ్ళు గల ఈ చేపలు, నీటి పైభాగానికి వచ్చి, నీళ్ళకు పైన వేలాడే ఆకుల అంచులపై ఉన్న కీటకాల మీదికి, ముక్కులతో నీళ్ళను చిమ్ముతాయి. కీటకం నీళ్ళల్లోకి పడగానే పట్టి తినేస్తాయి, నీళ్ళల్లో ఉన్నప్పుడు కీటకానికి కనపడకుండా తగిన జాగ్రత్త తీసుకుంటాయి.



ittle one a cuddles?













The
CHANDAMAMA
Collection of Soft Toys

CHANDAMAMA TOYTRONIX

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 డిసెంబరు నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: - చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కొండంత ఏనుగుకు కన్ను గవ్వంత!

రెండవ ఫోటో: పసివాడి కళ్ళకు కొండంత వింత!

పంపినవారు: టి. అలివేలుమంగ, W/O టి. ఎస్. ఎన్. మూర్తి, గెడ్డవీధి, పార్వతీపురం-532 501

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

